# అంకితము

కరుణాకటాక్షుండును ఆశ్రితజనపాలుండును, సత్యమూర్తియునయి వెలసిన కీర్తిశేషులగు మాతండ్రి ఉప్పల వీరన్న గారి పాదములకు "శీతాంశోరమృతార్పణం" అనునటుల నీకృతిని సమర్పించితిని.

ఉ॥ శ్రీదగుణాఢ్యుఁడై చెలఁగి ♦ చెన్నలరారఁగ కీర్తిసంపద
ల్లాదరభావమొప్పఁగ న ♦ నాథులఁబ్రోచుచు సత్యమూర్తియై
యాధరనేలు కల్పతరు ♦ వే? యనన్ొప్పెడి నాదుతండ్రికి
న్నేదయుఁబాయుఁ బ్రీతి కడు ♦ నెంతయు నిచ్చితి నంకితంబుగన్.

# పీఠిక

ఇందలి కథాంశము హిందిలోనున్న యొకపొత్తము ననుసరించి వ్రాసితిని. కథాంశమది యేమైనను, హావభావములు పూర్తిగా మార్చి వ్రాసితిని. ఈపుస్తకము ప్రథమప్రయత్నముగావున గుణగ్రహణ పారీణులగు పండితోత్తము లిందలితప్పులను మన్నించి యొప్పుల నేగ్రహింతురుగాక. ఈ పుస్తకమునందు పాఠకుల కింపుగానుండుటకై పద్యముల నెక్కువగా వ్రాసితిని. నాటకము నాడువారు కొన్నిటిని మానుకొనవచ్చును. వ్రాయుటకు ప్రోత్సాహ మొసగించిన మిత్రోత్తములగు మ॥ రా॥ శ్రీ॥ ౹౹చ్చు రామచంద్రయ్యగారికి, ఈపుస్తకమును శ్రమయనక తప్పులులేక సవరించిన మిత్రరత్నములగు బాలకవిశిఖామణి శతావధాని మ॥ రా॥ శ్రీ॥ దోమా వెంకటస్వామి గుప్తగారికిని నా కృతజ్ఞతాపూర్వక వందనము లాచరించుచు నింతటితో విరమించుచున్నవాడను. మఱియు, నెలపదిరోజులలో నీపుస్తకమును ముగింపగలిగితిని.

పరా:— ఈ పుస్తకము గ్రంథకర్త యనుమతిలేనిదె యెవ్వరును నాటకమాడ బ్రదర్శింపరాదు.

ఇట్లు,
గ్రంథకర్త.

# పండితాభిప్రాయము

(శ్రీరస్తు చిరంజీవి ఉప్పల చంద్రశేఖరగుప్తగారిని గూర్చిన యభినందనోత్పలమాలిక)

ఉ. నీవు లిఖించి యెంతయును నెక్కొను ప్రేమను బంపినట్టిది
వేవడినొప్పు "చంద్రికళ పెండ్లి" యటంచను నాటకంబు స
ద్భావముతోఁ బఠించితి; సెబాసు! వయస్సున చిన్నవయ్యు బల్
హావవిలాసభావవరభవ్య కవిత్వముఁ జెప్పనేర్తి యుక్
భాషితరీతి యత్నము నొనర్చియు నోననఁ జెల్లునట్టి మే
ల్త్రోవను ద్రొక్కినావు; బుధులున్ మదిమెచ్చఁగ నింకనిట్టులే
వావిరిఁ గావ్యజాలముల బాగుచెలంగఁ బఠించి, మాధురీ
శ్రీవిలసత్ప్రసూనచయరీణపరీమళచారుమాకరం
దావహ మోదదాయకగుణాంచితసత్కవనంబుఁ జెప్పి యీ
భూవలయంబునందునను బొల్చెడి వైశ్యకులంబునందునన్
బావనకీర్తియొంటి పొలుపాఱఁగఁ గాంచియు నాదివాకరం
బేవగఁ జెందకుండఁగ రహించెడి గ్రంథములన్ రచించి, నా
నావసుధాప్రదేశసుజనప్రకరప్రమదప్రదప్రభా
శ్రీవెలయంగ సౌఖ్యములఁ జెందుము యుప్పల చంద్రశేఖరా!

ఉ. ఈవిధ దీవనంబులిడి యిప్పుడు వ్రాయుట యేమనంగ, నీ
వీవిధి నంపినట్టిది రహించెడి నాటకమయ్యు! కైతమ
య్యా వెస వృద్ధిసూచక మొయారముగా దనరారు బాల్యసు
శ్రీ వెలయింపుచున్ గనుకఁ జెన్నుగ "బాలకవి" యటంచు, నే
నే వసుధన్ భవద్యశము పెంపగు; నుప్పల చంద్రశేఖరా!

ఇట్లు మిత్రము,

[illegible]

# ఇందు వచ్చు పాత్రలు

## పురుషులు.

సుదర్శనుఁడు—కథానాయకుడు.
సురేంద్రుఁడు—సుదర్శనుని సవతితల్లికొడుకు
నయనపాలుఁడు—సురేంద్రుని పితామహుఁడు.
దుష్టసేనుఁడు—సురేంద్రుని మంత్రి.
దుర్మదుఁడు—నయనపాలుని మంత్రి.
పురంజయ చంద్రశర్మలు—సుదర్శనుని మిత్రులు.
యోగి—కథానాయకుని జామాత.

ఇంకను కొందరు సమయమునుబట్టి పాత్రల ధరింతురు.

## స్త్రీలు.

చంద్రికళ—కథానాయిక.
పద్మావతి—చంద్రికళతల్లి.
సుశీల—సుదర్శనునితల్లి.
కమల-విమల—చంద్రికళ చెలికత్తెలు.
నీరద-శారద—మునికన్యలు.

శ్రీ రామచంద్రాయనమః.



# చంద్రకళాస్వయంవరము

## నాంది

శా॥ శ్రీరామా! కరుణాకరా! శుభకరా! ♦ సీతావరా! నిత్యము
న్నారంబో భవదీయపాదభజనా ♦ నందంబు నే గోరెద
న్నీరేజేక్షణ! భక్తపాలహృదయా! ♦ నీవెప్పుడు న్నాపయి
న్వేరానిమ్ము భవత్కృపారసము నా ♦ వేడ్కల్ ఫలింపన్ హరీ॥

## —♦ ప్రస్తావన ♦—

(ప్రవేశము—సూత్రధారుఁడు.)

సూత్ర—ప్రియా! ప్రియా! ఇటురమ్ము.

నటి—(ప్రవేశించి) ప్రాణేశ్వరా! నన్నుఁ బిలుచుటకుఁ గారణమేమి?

సూత్ర—(సభాభవనముఁ జూచుచు) ప్రాణేశ్వరీ! ప్రాజ్ఞులచే నొప్పు చున్న యీసభాభవనమును విలోకింపుము.

గీ॥ ఈసభాభవనంబున ♦ నింపుమీర
మనదు నాటకమును జూడ ♦ మమతతోడ
పెద్ద లేతెంచి రెంతయుఁ ♦ బ్రేమమీర
నాదుభాగ్యంబుగాదె యో ♦ నళిననేత్రి!

సూత్రి—"చంద్రికాస్వయంవర" మను నాటకమును.

నటి—దాని నెవరు రచియించిరి?

సూత్రి—చెప్పెదను వినుము:

ఉ॥ పరమగుణాభిశోభితుఁడు ♦ బచ్చుకులాంబుధి పూర్ణచంద్రుఁడై
నిరతము శారదఁ గొల్వఁగను ♦ నెక్కొను వీరనపుత్రిరత్నము
స్సరసతఁ జెందినట్టి కవి ♦ చంద్రిమఁ బుప్పలవంశ్యచంద్రశే
ఖరుఁ డను వైశ్యవంశజుఁడు ♦ ఖ్యాతిచెలంగ రచించె దీనినిన్ ॥

నటి—నాథా! అతఁడు బాలుఁడని వినియున్నదానను. ఇతని నాటకం
బును బ్రదర్శించి యీరసికుల కేవిధంబున నెందంబున నానం
దముఁ గల్గింతుమో కదా!

సూత్రి—బాలిక! అట్లనవలదు.

గీ॥ బాలుఁడైనను నేమి యో ♦ పద్మనేత్రి!
సరసకవితను జెప్పెడి ♦ జాణయతఁడు
అట్టి సరసుని నాటకం ♦ బంద మొసఁగ
నాడినను వీరి కానంద ♦ మగునుగాదె?

మఱియు,

గీ॥ క్షీరనీరంబులను వేరు ♦ చేసి, పాల
గ్రోలురాయంచ లట్టుల ♦ గొప్పవారు
మంచిగుణముల నెలమి గ్ర ♦ హించి యెపుడు
విడచిపుత్తురు తప్పుల ♦ వేడ్కతోడ.

నటి—మనోహరా! ఇవ్వసంతాగమనం బానందదాయకంబై యెందఱం
బానందసందోహంబునఁ దేల నెవ్విధంబునఁ బ్రకాశించుచున్న
దో, చూడుఁడు.

కవిరాజవిరాజితము

కనుఁగొన బువ్వులు ♦ కంటికింపుగఁ ♦ గన్పడుచుండెను ♦ కాంతులతో
న్వినగను గోవెల ♦ వీనులకింపుగ ♦ వేడ్కఁగ గూసెడి ♦ వింతమెయిన్
జనఁజన నీరహ ♦ శబ్దములీనుచుఁ ♦ జక్కఁగఁబర్వెడుఁ ♦ జాలవహిన్
గనినను నెంతయొ ♦ కంటికినింపుగ ♦ గల్గిన యీవన ♦ కాంతులాగిన్॥

సూత్రి — ఆహా! ప్రాణేశ్వరి! నీమనోహర గానామృతపానంబున మదీయ మానసం బెంతయో ఆనందంబొందెనుగదా!

నటి — నాథా! మన మాలస్యంబు గావించినామని వీ రెంతయో మనం బునఁ గోపించుకొనియెదరు. మన మింక నాటకపాత్రల ధరింతము రండు.

(నిష్క్రమింతురు.)



శ్రీరస్తు.

# చంద్రకళాస్వయంవరము

## ప్రథమాంకము

రంగము—ఉద్యానవనము

(చంద్రికళ తనసఖులగు కమల, విమలలతో నుండును.)

కమ—ఆహా! సుందరీ! చంద్రికళా!

ఉ॥ సుందరమైన యౌవనముఁ ♦ జూచిన సెంతయుఁ డెందమందు నా
నందముఁ గల్గజేయుచును ♦ నల్వగ మానసచింతలన్నియు
న్నందియు మేల! నిక్కముగఁ ♦ జయ్యనఁ ద్రోయునుగాడె చూచితే
సుందరగాత్రి! చంద్రికళ! ♦ చూడుమి యౌవనరామణీయతన్॥

ఓ రాజీవనేత్రా! నందనోద్యానంబువలె విరాజిల్లు నీ వన సౌందర్యముఁ గాంచిన డెందమందున నెంతటిచింతగలవారికైనను పూర్ణానందమును గలిగింపక మానదుగదా! ఆహా! అటు చూడుము; కమలాకరంబునందుగల కమలకల్హారంబులపై ఝంకారరవంబుల సారంగంబు లేవిధంబున మధువుం గ్రోలుచున్నయవో! కలికీ! ఇటువినుము; కోవెలలు తమ కలకంఠరవంబుల నేవిధముగా 'కూకూ' యని కూయుచున్నవో! మఱియు నీమనోహరచక్రిస్తనములవలె నొప్పు పూలమంజరులఁ గంటివే! చంచలనేత్రా! నీ దంతపంక్తింబోలు నా దాడిమీఫలబీజంబులఁ గనుము. చెలీ! నునుపైన నీయూరువులంబోలు నా కదళీవృక్షములం గని యానందపడుము. ఆహా! అటు చూడుము.

ఉ॥ పంకజనేత్రి! చూచితివె? ♦ పంకజమిత్రుఁడు వింతకాంతితోఁ
పంకజగూపియై నెగడి ♦ పర్విడుచుండె నిశాభయంబుచే
జంకొకయింతలేక మదిఁ ♦ జక్కఁగఁ జీకటు లచ్చటచ్చట
న్కొంకువనంబుచే జగము ♦ నంతయు నిండుచు నుండె నెంతయున్.

విమ—అమ్మా! అమ్మగారు నీవివాహవిషయంబై చాలఁ దొందరపడు
చున్నవారు. వివాహమైనతరువాత మమ్ముఁ గాంతువో? లేదో?

కమ—సఖీరత్నమా! వనవిహారంబున నీసుకుమారశరీరంబు బడలికఁ జెం
దినయది. కాన రత్నమయ సోపానములచే నొప్పునీసరోవరతీ
రంబున నున్నవృక్షచ్ఛాయలఁ బవ్వళించి చల్లనగుగాడ్పులఁ బడ
లికదీర నిందిందిరంబులు మధువులగ్రోలుచున్న పుష్పమంజరుల
సౌరభముల నెందం బానందం బొందుచు శయనింతము రమ్మా.

విమ—సఖీ! చంద్రికా! అదిగో! మీతలిదండ్రు లిటకే వచ్చుచున్న
వారు.

(ప్రవేశము - రాజు విక్రమకేతుఁడును, రాణి పద్మావతియు.)

పద్మా—అమ్మా! ఇటురమ్మా. మీతండ్రిగా రదిగో!

చంద్రి—తలిదండ్రులారా! మీ కిదే నమస్కారము. మీర లీవిధంబున
నేతెంచుటకుఁ గారణం బేమి?

విక్ర—(చెంతకుఁదీసికొని) పట్టీ!

ఉ॥ ముద్దులపట్టి! యెంతొ ప్రియ ♦ మున్ దగఁ జిన్నటనాటనుండియు
న్పొద్దగఁ బెంచి యెంతయును ♦ ప్రేమను పెంచుచు వేరువారికి
న్ముద్దులుగుల్క నిన్ను నిడ ♦ ప్రొద్దులుబుచ్చగ నామనం బహా!
తద్దయు ఖేదమొందెడుగ ♦ డల్పగ నాహృదయంబులోపలన్.

పద్మా—(చెంతకుఁదీసికొని ముద్దిడికొనుచు) పుత్రీ!

సీ॥ నీచిన్నియాటలు ♦ నీముద్దుపల్కులుం బె
నెవ్వారి కిక నేర్పె ♦ నెంతువమ్మ!

నీచిన్ని పాటల ♦ నెఱ నేఁడు హృదయంబు
నానందపఱచెదో ♦ యలరుబోఁడి!
నిను ద్దుహంసల ♦ నోమి యెవ్వరు ముద
మందఁ జేయుదురమ్మ ♦ యమలచరిత!
నీచిన్నితోఁటల ♦ నిటుగా విహరించి
యానందమొందగ ♦ నమరు లెవరు?

గీ॥ అన్ని మాకింక కరువయ్యె ♦ నరసిచూడ
నీవు లేనట్టి మాయున్కి ♦ నిజముగాను
వట్టి దేసుమ్మి! యింకను ♦ వనజనేత్రి!
నిన్ను బాయఁగ లేముగా ♦ నిర్మలాంగి!

హా! కుమారీ! నీవులేని యీ రాజ్యవైభవము లేల! ఈసంపద లేల! ఈనందనోద్యానవనంబులేల! యీ యాభరణంబులేల!

సీ॥ చంద్రబింబముఁబోలి ♦ చక్కనౌ నీమోము
వీక్షింపఁ జాలదే ♦ విమలచరిత!
కమలంబులన్బోలి ♦ కన్పట్టునీ కనుల్
వీక్షింపఁ జాలదే ♦ విమలచరిత!
నవముత్యములఁబోలి ♦ మెఱయునీ లేనవ్వు
వీక్షింపఁ జాలదే ♦ విమలచరిత
నవపల్లవముఁబోలి ♦ నాజూకౌ నీమేను
వీక్షింపఁ జాలదే ♦ విమలచరిత!

గీ॥ ఇన్ని వైభవములు మాకు ♦ నేలయమ్మ
యింతి నీవేని యుండఁగ ♦ నింపులేల
నీవు రాజ్యంబు వైభవ ♦ మేలయమ్మ
మాకు దిక్కెవ్వరమ్మగో ♦ మాదుతల్లి.

చంద్రి—జననీజనకులారా! మీ రంత విచారింపనేల?

ఆ॥ వె॥ తల్లిదండ్రులార ♦ తగదు మీ రిట్టుల
దుఃఖమొంద నేమి ♦ తోఁచదయ్యె

తెలిసినట్టి మీరు ♦ తెలియనట్లుగ నేడ్వ
తెలివిలేని నేను ♦ తెలుపఁగలనె?

ఆహా! మీరు సంతసించుటకు మారుగా ఖేదమొందు టిది కడు తగనిపని.

విక్ర—తల్లీ! చిన్ననాటనుండి నిన్ను గనుచున్నాఁ బెంచి వేరొకరి కిచ్చి విడనాడుటకు నాకు మనసురాకున్నయది. అయినను దైవవిధి నెవ్వరు తప్పింపఁగలరు!

చంద్ర—తండ్రీ! అట్లనవలదు. మాతల్లి నీకెట్టుల లభియించెనో నీకు తెలియదా? వారితలిదండ్రు లెంత దుఃఖించియుందురు! కావున నింకనైనను నూరడిల్లుఁడు.

పద్మా—పుత్రీ! చంద్రికా! మీతండ్రిగారు దేశదేశములకంపి చక్కనైన రాజపురుషుల ప్రతిమలఁ దెప్పించినారు. యందు నీ కెవ్వని యందిష్టమో వానికిచ్చి వైభవోపేతంబుగాఁ బెండ్లిసేతురట.

(పటములనిచ్చుచున్నయది.)

చంద్ర—(పటములఁజూచి యూరకుండును.)

విక్ర—తల్లీ! ప్రతిమలఁజూచి యూరకుందువేల?

చంద్ర—(తలవంచుకొని మిన్నకుండును.)

కమ—సఖీ! తండ్రిగా రడుగుచున్న మాటకుఁ బ్రత్యుత్తర మీయ వేమి?

పద్మా—తల్లిదండ్రులముగు మాయెడలనా సిగ్గు?

చంద్ర—తల్లీ! క్షమియింపుము. ఇందు నాకెవ్వరును నచ్చుటలేదు.

విక్ర—అమ్మా! కమలా! నీవైనను బోధింపవమ్మ!

కమ—సఖీ! చంద్రికా! మీతండ్రిగారేమో యడుగుచున్నారు, వింటివా!

విక్ర—తల్లీ! నేను దేశదేశములకంపి చక్కనిచక్కలవలెనున్న రాజపుత్రికల చిత్రపటములఁ దెప్పింపనిశ్చయించినాను. ... లేదా?

చంద్ర—తండ్రీ! సన్నివేశము పెండ్లికై బలవంతపఱుపకుడు.

పద్మా—ప్రాణేశ్వరా! దానిని బలవంతపఱచుటేల? మనమొక స్వయంవరమును మంచిముహూర్తమున నిర్ణయించి సకలరాజపుత్రుల నా స్వయంవరమునకు రప్పింపవలయును. అందు మనరాజపుత్రి యెవ్వరిని వరించిన వానికిచ్చి వివాహముఁ గావింతము.

విక్ర—పట్టీ! చంద్రికా! మీతల్లిగారు నుడివిన వాక్యములు నీకిష్టమేనా?

కమ—మహాప్రభూ! అమ్మగారు నుడివిన వాక్యముల మాచెలి మెప్పుకొన్నయది.

విక్ర—అయిన సంతోషమే!

పద్మా—బిడ్డా! భోజనవేళ మించినది, రమ్మ పోదము.

విక్ర—కమలా! విమలా! ప్రొద్దుపోయినది. మీసఖితో మీరుకూడ రండు. (పద్మావతి- విక్రమకేతుఁడు నిష్క్రమింతురు.)

విమల—(చంద్రికపైటచెఱఁగును బట్టుకొని) ఓహో! క్రొత్తపెండ్లికూతురు కావలయును.

కమ—ఆహా! పెండ్లికొమార్తెగారికి పెండ్లియనగానే ముఖవికాసము హెచ్చిపోయినది.

చంద్ర—(కోపముతో కమల చెంపపయిఁగొట్టి) చాలుచాలు. మీసరసము లికఁ గట్టిపెట్టుడు.

కమ—(చెంపతడవికొనుచు) పెండ్లియనగానే కోపము వచ్చినయది. అత్తగారింటి కేగినతరువాత మమ్ముఁ గాంచునో? లేదో?

విమ—అదిగో! అమ్మగారు భోజనమునకై పిలుచుచున్నారు. పోవుదము రమ్మ. (అందఱు నిష్క్రమింతురు)

(ప్రవేశము వెంకడు)

ఓఓఓఓ! వినండీనండీనండీ! అమ్మగారి స్వయంవరమట! ఇల్లువాకిల్లు శుద్ధిచేసుకొని రాజుగారి కూతురి స్వయంవరానికి మీరందరూ తయ్యారుండాలసి రాజుగారి సెలవయిందురోయ్!

(డప్పు గొట్టుచున్నాడు.)

(ప్రవేశము రామశర్మ, వెంకటశర్మ.)

రామ—వరే! వెంకా! ఏంటోయ్! ఏమో చాటిస్తున్నావు!

వెంక—అమ్మగారి పెండ్లమ్మగారి పెండ్లి!

వెంకట—ఓరీ సన్నాసి వెధవ! అమ్మగారి పెండ్లంటూ వేసేవేరా! ఎవరి పెండ్లిగాను?

వెంక—నేమరయ్యా! బాపనయ్యా! కొత్తగా వేసేదేటయ్యా!

(దూరముగా తొలగును)

రామ—(వెంకడిపైకి దెబ్బవేయబోవుచు) మామ—చివాడవుకావటోయ్! ఎవరి పెండ్లంటి?

వెంక—(దూరముగా తొలగుచు) ఏమయ్యా! మేం పెద్దింటోల్లము. మమ్ము మునుతావేమిటి? రాజుగారికూతురి పెండ్లంటేను!

రామ—రాజుగారి కూతుర్దే! రాజుగారి కూతుర్దే!

వెంక—ఏమయ్యా! బాపనయ్యా! నకు పిచ్చెత్తిందేంటియ్యా!

వెంకట—ఓరే! రామా! మన కింక భోజనాలమీద భోజనాలే!

రామ—శుభ్రింగా మాయింట్లో పది హేనురోజులవరకు నిప్పే వెలిగేది లేదు.

వెంకట—నా భార్యాబిడ్డలు దేశానికి వెళ్లాయి. రేపే తోలుకవస్తాను.

వెంక—ఓయ్ బాబో! ఈ బాపనోల్లకు భోజనాలంటే మాప్రీతి.

(అని పైవిధముగా నరచుచు, డప్పుకొట్టుచు వెడలిపోవును)

రామ—(చెవులుమూసికొని) అబ్బా! నీనోరుమండ! నా చెవులు ప్రతి ధ్వనిచ్చినాయిగదరా!

వెంకట—ఓరే! రామా! మనకాలస్యమైన మనకాధనికుఁడిచ్చుదక్షిణ కాస్తా పోతుంది, రా, రమ్ము.

(రామశర్మను నీడ్చుకొనుచు వెడలిపోవును.)



శ్రీరస్తు.

# చంద్రకళాస్వయంవరము

## ద్వితీయాంకము



(చంద్రికళ విచారముచే నొక సోఫాపై కూర్చొనియుండ కమల విమలలు చెంతనుండుట.)

చం—(సోఫానుండి లేచి) హా! నవనీతకోమలహృదయా! హా! నీలమేఘాంచితకుంతల! హా! నవమోహనమోహనాంగా! హా! కరుణార్ద్రహృదయా! భవదీయసుందరముఖారవిందసందర్శనముఁ గావించిన నేకాంత వరింపదు? నామనోనాథా! ఇంకొకసారి నీముఖచంద్రబింబంబును నీదాసురాలగు నీకళకుఁ జూపవేమి?

కమ—అమ్మా! చంద్రికళా! నీ విట్లు స్వప్నపురుషునికై చింతనొంద నేల? నీవు వట్టి బేలవుసుమీ!

చం—కటకటా! నే నేమి సేయుదును. నా మనోహరుఁ డెచటనున్నవాఁడో కదా! జీవసంతానంబులారా! నామనోహరుని మీ రెచటనైనఁ గంటిరే? విహంగంబులారా! మీరైన నామనోనాథుని జూడ నరసితిరే?

సీ॥ నామనోనాథుని ♦ నాయొద్ద జేర్పరే
చెలువొంద నాముద్దు ♦ చిలుకలార!
నాప్రాణనాథుకు ♦ నాకు నిప్పించరే
పిల్లులారా! వన ♦ భిల్లులార!
నాముద్దుప్రియు నింక ♦ నా కీయరే వేగ
హంసలారా! ముద్దు ♦ హంసగార!

నా ప్రాణవిభు నయో! ♦ నా చెంత నుంచరే
వీరులారా! రణ ♦ శూరులార!

గీ॥ నా మప్రియు నింక నాకిమ్మం ♦ డాదరమున
నా మనోనాథుని న్జూడ ♦ నా మనంబు
కలతఁజెందుచునుండెను ♦ కావఁ డికను
వేగ రారయ్య నా ప్రాణ ♦ విభునితోడ॥

హా! మనోహరా!

గీ॥ నా మనోనాథ నన్నింక ♦ నా విభుండ!
యేలుకొమ్మిక ప్రియముతో ♦ నీమనసఖని
దర్పకుని బాధకింక నే ♦ తాళలేను
గాన వేగమె ప్రోవుమీ ♦ కరుణాహృదయ॥

కమ—తల్లీ! ఊరడిల్లు మూర్ఛిల్లుము. ఏల నీకిట్లు దుఃఖవేదనచే గృశించెదవు?

చం—సఖీ! నే నెట్లూరడిల్లఁగలను? స్వప్నమునఁ గాంచిన యా పురుషునకే యున్న యనూనసౌందర్యము నే నెంతమరతుమన్నను మరపురాకున్నయదికదా!

ఉ॥ హాయిరె వానిమోము విక ♦ చాంబుజముం దెగడుం గలతాంతస
త్సాయకుఁ జేయు రూపులుగ ♦ సారసనేత్రుని జూపుఁజూడగా
కాయము సారు గాంచినను ♦ కాంతుని గేలి యొనర్పఁజాలుగా
గాయముకొల్చుగా యతని ♦ పాదము లెప్పుడు పద్మపత్రముల్.

మఱియు,

ఉ॥ అమ్మకచెల్ల! వానిగని ♦ నప్పటినుండియు నామనంబునం
దమ్మదనుండు బాణముల ♦ హుంకృతి నేయుచునుండె గ్రూరుఁడై
యిమ్ముగ వానివిగ్రహము ♦ దెంతయు గన్నులఁగట్టినట్లుగా
నెమ్మదిఁదోచుచుండెఁగద ♦ నే నెటు దాళగ నేర్తు నెచ్చెలీ!

కమ—సఖీ! ఏల యీలీల గుంజెదవు? కలనుగనినపురుషుఁ డెంద్రైన
నకలఁడా! వట్టిజేలవువలె నన్నావే? ఇకనైన నూరడిల్లుము.

విమ—అమ్మా! చంద్రికళా! నీవు వట్టివెఱ్ఱిదానివలెఁ గన్పట్టుచున్నావు.

చంద్రి—హా! నాప్రియసఖీమణులారా! మదనబాణపీడితనైన నాకిక్కెక్కడియూరట! అబ్బ! ఏమి వాని సౌందర్యము! చతుర్ముఖుఁడగు నాపితామహునికైన వాని సౌందర్యవైభవమును వర్ణింప నలవియగునా!

సీ॥ పూర్ణచంద్రునిఁబోలు ♦ మోమును గలవాఁడు
కమలంబులనోలు ♦ కనులవాఁడు
నీలమేఘచ్ఛాయ ♦ నెగడు కురులవాఁడు
మద్దులఁ గులికెడి ♦ మోవివాఁడు
వజ్రపంజరనిభ ♦ వక్షస్థలమువాఁడు
చిన్నని మధ్యంబుఁ ♦ జెలఁగువాఁడు
కమనీయమౌనపట్టి ♦ గా తీగుటెక్కువాఁడు
మగనైన నఖకల ♦ సొబగువాఁడు

గీ॥ భిల్లు లెంతయు భక్తితోఁ ♦ బెద్దజేయ
కొలువుదీర్చియు గద్దియ ♦ స్థూరునందె
చిన్నచిన్నగ నురటీల ♦ చేతనూప
చిన్ని కాంతారమందునఁ ♦ జెలఁగుచుండె॥

కమ—అమ్మా! చంద్రికళా! స్వప్నంబునఁ గాంచిన పూరుషుఁడు నిక్కువమటమ్మా!

ఉ॥ కాంతరో! యేల నీవిటులఁ ♦ గాఱియఁ జెందెదవమ్మ చెప్పుమా!
యింతిరో స్వప్నపూరుషుని ♦ కింతటి మోహము జెందెదమ్మరో!
యింతయు నమ్మగాదగునె ♦ యెక్కడి రాకొమరుండు వాఁడు, నీ
చెంతకుఁ జేరుటెక్కడిది ♦ చిత్రముగా! దలపెట్ట సుందరీ!

చంద్రి—హా! సఖీ! కమలా! కమలా! నాప్రియుఁడేడీ? అయ్యో! అయ్యో! మకరాంకుఁడు నన్నెంతయుఁ గాఁతియ పెట్టుచున్నవాఁడుగదా! హా! సరసీజముఖా! హా! మన్మనోహరా! మదనబాణపీడితనై నీసఖి దుఃఖ మొందుచుండ నింకను రావేమి? ఎంతటి కఠినహృదయుండవో కదా!—ఓరీ! మదనా!

ఉ॥ మారుఁడ! యేమిరా! యిటుల ♦ మాటికి మాటికి నాదుపైన హా!
క్రూరతఁదోఁప బాణముల ♦ గుంతితరీతిని వేయుచుంటివా?
కాఁతియ పెట్టెదేల? నను! ♦ కావుము వేగమె నీకు మ్రొక్కెద
న్భారము నీయదే యికను ♦ తద్దయు నీకిక సేవ సేసెదన్॥

కమ—సఖీ! చంద్రికా! చంద్రికా! ఏల యీలీలదుఃఖమొందెద వమ్మా! (పైకిఁజూచి) ఓయీ! మదనా! మదనా! నీకైనను మా చెలియెడల కరుణరాలేదా!

ఉ॥ ఏలర నీవు మాసుదతి ♦ నిట్టుల సూక్ష్మగ బాణజాలము
ల్వాలఁగ వేయుచున్నదిని ♦ జంచలతం గనఁజేసెదీవు? ఛీ!
చాలురచాలు చాలికను ♦ జంచలనేత్రల నేఁచిపించెదా
యేలర చూపెదీ విటుల ♦ నింతులపై భవదీయశౌర్యముల్॥

చంద్రి—హా! కమలా! నేనింక తాళలేను. నాతల తిరుగుచున్నయది. నామనంబంతయు నొకలాగ దిగులు నందినట్లున్నయది. నాకన్నులు కానరాకున్నయవి. నే నిఁక బ్రతుకను. అయ్యో! అయ్యో! నాతలిదండ్రులారా! మీ కూతు రిక నీలోకమున లేదనుకొనుఁడు. హా! హా!

(సోఫాపైఁబడి మూర్ఛిల్లును.)

కమ,విమ—హా! చంద్రికా! చంద్రికా! అయ్యో! అయ్యో! ఏమిది! యేమిది! వైద్యుఁడు—వైద్యుఁడు—(విమల లోపలికిఁ బరుగెత్తును.)

కమ—(పైన జేయివేసి నాడిపరీక్షించి) అమ్మాయీ! నామనం బిప్పుడు భయరహితంబైనయది. ఇది వట్టిమూర్ఛగాని వేరొకటి కాదు. అయిననేమి! విమలవైద్యునిచెంత కేగినదికదా! అయ్యో చంద్రికళా! లేనిపోనిదొకటి మనంబుననిడుకొని దేహము చింతలచే గృశింపఁజేసికొనియెద వేల? నావెఱ్ఱితల్లీ! స్వప్నమందుఁ గాంచిన పురుషుఁడెవ్వఁడైన నుండునా? యౌవనప్రాదుర్భావముచే మదనపీడితవై కుందుచుంటివిగాని మఱొకటిగాదు.

(ప్రవేశము—వైద్యుఁడు.)

వైద్య—(ప్రక్కకుఁజూచి) ఓహో! మంచిసమయమునకే వచ్చితిని. నామిత్రుని కార్యము నిరాటంకముగా నెరవేరగలదని తోచుచున్నయది. దైవము తోడ్పడుఁగాక! (చంద్రికఁజూచి) ఆహా! ఏమి యీకలికి సౌందర్యము! నిజముగా మారాకుమారుని కిరమణి తగిన సౌందర్యవతియే. పాపము! మారాజపుత్రుఁ డీసౌందర్యవతినిఁ గలను గాంచినదాదిగా కామపీడితుఁడై కృశించుచున్నవాఁడు. (పైకిఁజూచి) ఆహా! రాజకుమారా! సుదర్శనా! రాజ్యపరిభ్రష్టుఁడవైన నీకీ సుందరీలలామసందర్శనమునఁ జెందం బోనందంబొందక మానదుగదా! ఆహా!

ఉ॥ ఈ జలజాయతేక్షణను ♦ నీనవమోహన మోహనాంగినిన్
ఈజగమందుఁ బోలరు మ♦ అంతటి సుందరగాత్రులైన; మే
లీ జగదేకసుందరిని ♦ నే బ్రియమిత్రునిచెంతఁ జేర్చినన్
నాజననంబు సార్థకత ♦ నల్వొగఁ జెందునుగాదె యెంతయున్.

(సభాసదుల విలోకించి) ఓనామిత్రులారా! ఓమేరేదోస్తా! ఓమైడియర్ ఫ్రెండ్స్! నేను వంకణ, కొంకణ, కర్ణాట, కాంభోజ, నేపాల, ఘూర్జర, మహారాష్ట్ర, పాంచాల, గౌడ, కాశ్మీరాది దేశంబులఁ దిరిగి తిరిగి గొప్పగా పేర్వడసితిని. ఇంక నామెడలోనా! మెడలోన! ఆ పేష్లు నాకు రావులే. మా

యింట్లో నెక్కడఁజూచినా యవ్వే! ఇంక మాయింటివారవన్ని జూచి సంతసించుటకుమూరు మెడలేసుకొని వచ్చినారా! యని యొక పటునిటు నూగులాడిస్తుంటుంది. అయ్యో! కలికాలము గదా! నాపెండ్లానికి రత్నాలనగలేనా? ముత్యములనగలేనా? ఇంకేమేమో? వంటినిండాదిగేసినాను. అవ్వి నాకు జ్ఞాపకమున్నవా? ఇన్నిపెట్టినా తృప్తి కొంచమైనాలేక, నాకు బనారసుకోకలుఁ గావాలె. బనారసు రయికలో? రవికలో? అవ్వి నాకుఁ దెలియదు. అవ్విగూడా కావలెనంటుంది ఏమి చెయ్యవలె? నాకర్మము. సావిత్రి, అనసూయ, అరుంధతి మొదలగు పతివ్రతల చరిత్రపుస్తకముల జదువుమని తెచ్చిన వానిని నేలకుఁగొట్టి తుక్కుతుక్కుగా నొనర్చును. అయ్యో! నాదైవమా! నీవైనా నాపెండ్లానికి మంచిబుద్ధుల నేర్పవయ్యా! (సభికుల వంకఁజూచి) అయ్యో! సభికులారా! నాభార్యాగొడవలో మీ కాలవ్యయమయిపోవును. ఇక నామందుప్రభావంబులను వినుఁడు. (తన ప్యాకెట్టునుండి సీసా నొకటి పైకిఁదీసి) ఇదిగో! ఇవే! స్త్రీసంభోగజనిత దుఃఖనివారణమాత్రలు. వీనిని సేవించిన స్త్రీవల్లఁ గలిగిన జాడ్యములు దూరముగా తొలిగించి యయ్యగారిని త్వరగానే ప్రయాణ సంసిద్ధులఁ జేయును. (సీసా సభికులకుఁజూపి) మీకేమయినఁ గావలయునా? (నిరుత్సాహుఁడై) అయ్యో! అక్కరలేదా? సరే! (ప్యాకెట్టులోనుండి వేరొకసీసాను పైకిఁదీసి) ఇవిగో! స్త్రీవశీకరణమాత్రలు. వీనిని యర్ధరాత్రి సానపైనూరి వెన్నెలయమావాస్యలో దీనిని మీకే స్త్రీపై యభిలాషయున్న నాస్త్రీతలకు రుద్దినవెంటనే కౌఁగిలించుకొనును. (సభికులతట్టు చూచి) మీకేమైనఁ గావలయునా? దీనివెల యత్యల్పము. ఒక్కసీసా నూరురూపాయలకన్న నెక్కువగా నుండదు. (నిరుత్సాహుఁడై పెదవులు విఱచుచు) నామందులే మీ కక్కరలేనప్పుడు మీతో యామదప్రభావంబులఁ జెప్పఁబూనుటకు? పోని! మీకును నాకును

శ్రీమ తప్పిపోతుంది. (కమలచెంత కేగి) మీరేనా నన్నుఁ బిలిచినది?

కమ—అయ్యా! మీరేనా భిషగ్వరులు?

వైద్యు—అవును, నేనే!

కమ—అయిన మాసఖస్థితిని పరీక్షింపుడు.

వైద్యు—(పరీక్షించి) ఇది వట్టిమూర్ఛగా తోస్తున్నది. (తన పాకెట్టునుండి యొకసీసాను బయటకుదీసి చంద్రికళముక్కుచెంత నుంచును.)

చంద్రి—(లేచి) హా! హా! నా—మ—నో—హరుఁ—డు! నామనోహరుఁడు!

కమ—తల్లీ! ఊరకుండుము మూరకుండుము నీదేహంబు జబ్బుగానున్నయది.

చంద్రి—(గొంతు సవరించుకొని) అయ్యో! అయ్యో! నామనోమోహనుఁ జూడనిదే నాజీవంబు లెట్లునిలుచు?

వైద్యు—(చంద్రికళనుజూచి) నీ వేపురుషవరేణ్యుని వరించితివో వానిని నాజ్యోతిషప్రభావంబునఁ గంటిని. వాఁడయోధ్యాపురరాజగు జస్వంతునికుమారుఁడు. ఆతఁడిప్పుడు పినతండ్రివలన రాజ్యపరిచ్యుతుఁడై యొక మునివనవాటిక తన జననీసమేతుఁడై యున్నవాఁడు. అతఁడు కాళీపూజాధురంధరుఁడు. ఒకనాఁడాతని కాళీపూజామహత్వంబునఁ జేసి దేవి స్వప్నంబున బ్రత్యక్షమై నిన్నుంజూపి నీవృత్తాంతమంతయుఁ దెల్పి నిన్నుఁబెండ్లియాడుమని నుడివెను. అప్పటినుండియుఁ నాతఁడు నీమోహనాకారంబునే తలంచుచు కామోద్రేకపీడితుఁడై బాధపడుచున్నవాఁడు.

చంద్రి—ఆహా! భిషగ్వరా! మదనజ్వాలానలకీలల దందహ్యమానమై మాడిపోవుచున్న నాహృదయంబు నొకింత చల్లఁజేసి రక్షిఁ

తివిగదా! తండ్రీ! నే జననంబందినదాది యిట్టి సద్వృత్తాం
తంబును నెన్నఁడును వినలేదు నావీనులు పవిత్రము నొందె.
నాహృదయంబు సార్థకంబయ్యె. మీ సందర్శనలాభంబుచే
కృశించిన దేహం బానందంబుచే నుప్పొంగె. వైద్యశ్రేష్ఠా!
నా మనోనాథునివృత్తాంతంబు నీజ్యోతిషప్రభావంబున నెఱిం
గించి, నావీనులకు వినిపింపఁజేసి, నాదేహం బమందానందంబుఁ
జెందింపఁజేసినందులకై యీ నాకృతజ్ఞత నందుకొనుఁడు.
(తనమెడనున్న ముత్యాలహారము దీసి వైద్యుని కిచ్చును.)

వైద్య—(చిఱునవ్వుదోఁప) రాజకుమారీ! నేనుజేసిన యుపకారము
లేమియు లేకున్నను, నన్నింత కొనియాడ నీయుదారస్వభావము
తప్ప వేరు కాదు. నే నింక సెలవుఁ దీసికొనుచున్నాఁడను.
(తనలో) ఇంక నాకుఁ గావలసిన పనియేమో యైపోయినది.
నే నింక నిచటనుండుటెందుకు? ఈ తారహారంబును మా
గాకొమరునికి బహుమతిగా నిచ్చెదను.

చంద్రి—చెలీ! ఈతఁడెద్దియో గొప్పపండితుఁడుగాఁ దోఁచుచున్నవాఁడు.

కమ—నాకును నట్లె తోఁచుచున్నయది.

చంద్రి—హా సఖీ! కమలా! నామనోహరునిజాడ మనకింకను దెలియ
లేదు. వివాహమేమో కొద్దిరోజులే వ్యవధిగా నున్నయది.
ఇదంతయుఁ జూడ నాకేమియుఁ దోఁచకున్నయది. దైవము
నన్నేమిచేయునో తెలియదు.

కమ—అమ్మా! కళా! నీప్రాణనాథునిజాడ నరసివచ్చెదను; కాని
నీవింక నెంతమాత్రమును జింతింపకుము—అదిగో! అమ్మ
గారు పిలుచుచున్నారు. రమ్మా, పోవుదము.

(కమల చంద్రికను బలవంతముగాఁ దీసికొనిపోవును.)

---

ద్వితీయరంగము—అయోధ్యాపురసమీపారణ్యము.

(ప్రవేశము - చంద్రశర్మ)

చంద్ర—ఆహా! కాల మొక్కరీతిగా నుండదు. అది చక్రమువంటిది. క్రిందను మీదు చేయును, మీదను క్రిందుఁజేయును; మిత్రుల శత్రులజేయును, శత్రులఁ మిత్రులఁజేయును; సన్మార్గుల దుర్మార్గులఁజేయును, దుర్మార్గుల సన్మార్గులఁజేయును; ధనాధిపతుల ధనహీనులఁజేయును, ధనహీనుల ధనాధిపతులఁ జేయును. ఆహా! దైవమా! దానకర్ణుఁడగు జస్వంతునిజూపి యతని రాజ్యం బంతయు వల్లకల్లోలంబుగాఁ జేసితివిగదా!

సీ॥ రాజ్యవైభవముల ♦ రంజిల్లువారిని
వనములపాల్సేసి ♦ వదలినావు
కనకసౌధంబులఁ ♦ గాంక్షనుండెడివారి
నడవిగుడిసెలకు ♦ నంపినావు
బంగారుటుయ్యేల ♦ నూఁగెడివారిని
కటికనేల బరుండఁ ♦ గడపినావు
తారహారంబుల ♦ ధరియించువారిని
తులసిమాలల నీవు ♦ తొడఁగినావు

గీ॥ అకట! యెంతయు వారని ♦ నడవిపాలు
చేసి కష్టములఁబెట్టి ♦ చెనటిపనుల
వారి రాజ్యంబులను వేరు ♦ వారికిచ్చి
యీవు సంతసమొందెదో ♦ యింపుమీర॥

(పరికించిచూచి) ఎవరో వచ్చుచున్నారు.

(ప్రవేశము—పురుషవేషధారియై కమల)

కమ—(చంద్రశర్మనుజూచి) ఓ బాబూ! ఎవరయ్యా మీరు? మీ నామధేయ మెయ్యది?

చంద్ర—మేము విప్రులము. నాపేరు చంద్రశర్మయందురు.

కమ—తమ దేయూరు?

చంద్రి—మా దయోధ్యాపురము.

కమ—మీ దయోధ్యాపురమా? మీయూర విశేషము లేమి?

చంద్రి—మాయూరవిశేషముల కేమిలే! కావలసినన్ని యున్నవి.

కమ—మీరాజగు జస్వంతసింహుఁడు చనిపోయినతరువాత మీయూర పెద్ద యల్లకల్లోల మయినదని వినియుంటిని. ఆసంగతేదో తెలుపగలరా?

చంద్రి—అవును. మాపెద్దరాజుగారగు జస్వంతసింహుఁడు మహాదాన కర్ణుండని భూలోకమునం దతి ప్రసిద్ధిగాంచెను.

కమ—అవు నాసంగతి నాకుఁ దెలియును. తరువాత?

చంద్రి—పాప మాతఁడు మావంటివారికిఁ గల్పవృక్షంబువలె నుండెడి వాఁడు. ఇప్పుడు దైవవిధిచేత పరలోకగతుఁడయ్యెను.

కమ—ఔనౌను. తరువాత?

చంద్రి—ఆ ధర్మాత్ముఁడు చనిపోయినతరువాత అతని పెద్దభార్యయగు సుశీలయును, చిన్నభార్యయగు మోహినియును, వీరిద్దఱును కలహించుకొనిరి.

కమ—తరువాత? తరువాత?

చంద్రి—పాపము! సార్థకనామధేయయగు సుశీల చాల నుత్తము రాలు. సద్గుణగరిష్ఠయని ప్రసిద్ధిఁగాంచినది.

కమ—ఔనౌను. నేనుకూడ వినియుంటిని.

చంద్రి—చిన్నదన్ననో, మహాధూర్తురాలు దానినిఁ దలచిన యన్నమే పుట్టదు. మహాపాతకురాలు. అగ్నిలేనిచోట నగ్ని రగిలింప జేయును.

కమ—అబ్బా! అంతటిధూర్తయా!

చంద్రి—ఇంక దానిధూర్తత నింతింతయన వీల్పడదు. చిన్నది మనః క్రోధానలదందహ్యమానయై తన సవతియుక్కయగు సుశీల

కుమారుఁడగు సుదర్శనునికి రాజ్యంబు చెందవద్దని కపటముచే
తనతండ్రియగు మగధేశ్వరుఁడగు నయనపాలునకి, రాజ్యము
నా కుమారుఁడగు సురేంద్రుని కిప్పింపవలయుననియు, దాని
కొఱకై సైన్యసమేతుఁడవై సహాయపడరమ్మనియు, లేఖ నొక
టంపుకొనియెను.

కమ—ఓహో! తరువాత? తరువాత?

చంద్రి—బిడ్డయేయన్న బిడ్డకన్న రెట్టింపుదుర్మార్గుఁడగు నా నయన
పాలుఁడు తనమనుమఁడగు సురేంద్రునికి రాజ్యంబు నిప్పింప
వలయునను కాంక్షచే యుద్ధసన్నద్ధుఁడై యయోధ్యాపురంబు
నకుఁ బ్రయాణమయ్యెను.

కమ—అయ్యో! సుశీలగతి యేమయ్యెనో?

చంద్రి—అంత సుశీల యేమిచేయుటకుఁ దోచక పాంచాలాధీశుఁడగు
తనతండ్రికి దన యాపదనివారణకై రమ్మని వ్రాసికొనెను.

కమ—అటుతరువాత?

చంద్రి—పాంచాలాధీశుఁడగు శూరసింహునికిని, మగధేశుడగు నయన
పాలునికిని ఘోరయుద్ధంబొకటి యయోధ్యాపురసమీపంబున
జరిగెను.

కమ—ఆహా! తరువాత?

చంద్రి—పాపము! దైవవిధి నెవ్వరుతప్పింపఁగలరు! సుశీలతండ్రియగు
శూరసింహుఁడు నయనపాలునిచే హతుఁడయ్యెను.

కమ—హాహాహా! ఎంతమాటెంతమాట!

చంద్రి—అంతట శూరసింహుని సైన్యము రాజుమరణించిన దుఃఖ
వార్త విని ఘోరముగా బోరి రణనిహతులైరి.

కమ—కట్టా! ఎంతఘోరమెంతఘోరము! సుశీలగతి యేమయ్యెనో
కదా!

చంద్రి—అత్తఱి సుశీల యేమియుఁదోచక తండ్రిగోల్పోయిన దుఃఖము

చే మనమంతయు నంధకారబంధురంబై యొప్ప తనరాజ్యము శత్రులచేతికిం జిక్కుటఁగని యా తండ్రి ప్రియముగల తన ప్రియపుత్రుఁడగు సుదర్శనుని తీసికొని యరణ్యమార్గంబునఁ బడి యెటకో వెడలిపోయెను. ఇప్పుడాతని కిరువదిసంవత్సరంబు లుండవచ్చును.

కమ—(తనలో) ఓహో! మాచెలి వరించిన పురుషుఁడు కాఁడుగదా! ఆవైద్యుఁడు చెప్పినసంగతియు నీవిధముగానే యున్నయది. నేను మాచెలియగు చంద్రికళయొద్ద సెలవుదీసికొని స్వప్నపూరుషునికై వెదకుచుంటిని. అతనిజాడ నీతని నడిగిన నేమయినఁ దెలియఁగలదేమో విచారించెదను. (ప్రకాశముగా) అయ్యా! వారిజాడ మీకేమయినఁ దెలియునా?

చంద్ర—వారిప్పు డెచ్చటనున్నది తెలియదు గాని ఎచ్చటనో మునివనవాటికయం దున్నట్లు తెలియవచ్చినయది.

కమ—అవును. నేనుగూడ నొకరివలన నట్టే వినియుంటిని.

చంద్ర—నాసంగతిఁ బూర్తిగాఁ జెప్పితిని. ఇంక మీయూర విశేషములఁ జెప్పుఁడు. మఱియు మీనామధేయంబుఁ జెప్పి నన్నుఁ గృతార్థుం జేయుఁడు.

కమ—మాది వారణాశీపురము. నాకిప్పటి పేరు భీమసేనుండందురు.

చంద్ర—ఓహో! మీనామధేయము వేఱొక్కటిగూడ నున్నయదా?

కమ—కొన్నివిషయములవలన పేరుమార్చితిని.

చంద్ర—మీరాజకుమారియగు చంద్రికళకు వివాహమనివినియుంటిని. విశేషము లేమి?

కమ—విశేషముల కేమిలే! కావలసినన్నియున్నవి.

చంద్ర—అయినఁ దెలుపుఁడు.

కమ—తెలుపుట కేమిలే! నాభాగ్యమేమయినఁ దరిగిపోవునా? వినుఁడు.

మా రాజకుమారియగు చంద్రికళ స్వప్నమునం దొక సుందరాంగునిఁ గాంచి మదనబాణపీడితయై బాధపడుచున్నయది.

చంద్రి—పాపము! యౌవనప్రాదుర్భావముగదా! తరువాత?

కమ—అంతకుముందే మారాజుగారు స్వయంవరమును చాటించి సకలరాజవరేణ్యులను శుభముహూర్తమునకు రమ్మని పత్రికల నంపుకొనెను.

చంద్రి—తరువాత?

కమ—వివాహమునకింక వారము రోజుల వ్యవధి యున్నదో, లేదో, అప్పటికప్పుడే గజ, రథ, తురగాదిసైన్యబలంబుల రాజవరేణ్యులం దఱు మాపట్టణంబున కిటకిటలాడుచుండిరి.

చంద్రి—పాపము! చంద్రికళ యెంత దిగులొందుచుండెనో గదా!

కమ—ఇదివఱకే చంద్రికళ తన మనోహరుని జాడ నరయుటకై తన సఖియగు కమలను బంపినది.

చంద్రి—నేనుఁగూడ వారిజాడనే యరయుచుంటిని. ఇంతవఱకును వారెందును గానబడలేదు.

కమ—అరెందులకు?

చంద్రి—సుదర్శనుఁడు నాచిన్ననాటి స్నేహితుఁడు. ఆతనిఁ గలియ నేగుచుంటిని.

కమ—నిజముగానే? అయిన మీతో నేనుగూడ వచ్చెదను.

చంద్రి—అదెందులకు?

కమ—చంద్రికళదాసినగు కమలను నేనే.

చంద్రి—ఓహో! అటులనా! అయిన సంతోషమే! రా, రమ్ము. మన మింక వారిజాడ నరయుదము. (నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



శ్రీరస్తు.

# చంద్రకళాస్వయంవరము

## తృతీయాంకము

రంగము—మునివనవాటిక

(ప్రవేశము—సుశీల కాషాయవస్త్రధారిణియై
చేతుల తులసీమాల నుంచుకొని.)

సుశీల—హా! పరాత్పరా! దీనబంధూ! మారాజ్యంబు శత్రువులపా
ల్గావించి మమ్ముల రాజ్యపరిచ్యుతులఁ జేసి పదునాల్గేఁడులనుండి
భీకరజంతు సముదాయంబుల యరుపులచే గుండెలు పటాలని
పగిలిపోవు నీ కాంతారమందున చిన్నని పూరిగుడిసెలలో నుం
చితివిగదా! ఆహా!

శా॥ కట్టా! మమ్ముల రాజ్యహీనులనుగాఁ ♦ గావించి నీవి ట్లహో
యిట్టిక్కట్టులఁ బెట్టుమ మ్ముల ని ♦ ట్లెన్నాళ్ళు బాధించెదో
కట్టా! నమ్మినవారి నీవిటు లహో ♦ కష్టంబులన్బెట్టగా
దిట్టా! నీకిది బాగుగాతగునులే ♦ తెల్లంబగున్ నీగతుల్॥

మఱియు "అనాథో దైవరక్షితః" అను సామెత వమ్మయ్యె
నా? పరమదయాంగా! నీదయాళుత్వ మెచటికేగినది! భక్తపాలనా!
నీభక్తపాలనగుణ మెచటికేగినది! అయ్యో! శ్రీహరీ! కనక
సౌధోపరిభాగంబున సువర్ణమణిమయస్థాపితంబగు నుయ్యాలల
నూఁగునట్టివారికీ కటికనేలనే శరణిచ్చితివిగదా!

హా! కాలమా! నీవంటి విపరీతమైన దానిని నేనెందును
జూడలేదుగదా! కటాకటా!

సీ॥ రాజ్యవైభవముల ♦ రంజిల్లువారికా
యీయరణ్యాన వ ♦ సింపవలసె!
తారహారంబుల ♦ ధరియించువారికా
తులసిమాలలు మేన ♦ వెలయవలసె!
పట్టుపుట్టంబులఁ ♦ బరగెడువారికా
కాషాయవస్త్రముల్ ♦ గట్టవలసె!
బంగారుపాన్పులఁ ♦ బండెడివారికా
కటికనేలల నయో ♦ కడపవలసె!

గీ॥ కటకటా! కాలమా యిట్టి ♦ కఠిన నీవు
ధర్మహీనులనందర ♦ ధరణినేల
బ్రీతినిల్పుచు నిచ్చును ♦ బెద్దగాను
జేసి రాజ్యంబులెల్లను ♦ జెఱచెదు గద!

హా! కమలా! ప్రియా! ఇంకనైనను మాయాపద నివారింపుమా!

ద్వి॥ హా! తండ్రి! దేవదే ♦ వా! బుధవంద్య!
భక్తపాలన! నన్ను ♦ బరగ సత్కరుణఁ
గాపాడి మాపైన ♦ కష్టముల్ పాపి
కరుణను మమ్మేలి ♦ కాపాడు తండ్రి॥

(ప్రకృతిఁజూచి) నా ముద్దులకొమరుం డింకను రాలేదు. కారణం బేమైయుండునో గదా! పదునాల్గేండ్లనుండి నా చిన్నిపుత్రుని నిమిత్తమై యీ నా జీవంబుల నిల్పితిని. లేనియెడల నీజీవంబు లన్ని [illegible] నాపతిపాదకమలములయందు విడచియుందును. అదిగో! ఎవ్వరో యిటకే వచ్చుచున్నట్లున్నయది.

(ప్రవేశము — శారద - వరదలు.)

శార — అక్కా! సుశీలా! మందహాసములనీను నీముఖారవిందము నేడేలొకో చిన్నవోయినది. కారణమేమి?

సుశీ — సోదరీ! నీవు నట్టిబేలవుసుమీ! నీ వింకను చిన్నదానవు. లోకజ్ఞానమేమియు నీకడ లేదు.

నీర—అక్కా! నీప్రియసోదరీమణులమగు మాయెడల నాశిమనోభావంబులఁ దాచుట?

సుశీ—(నీరదచెంప నిమురుచు) నా ప్రియసోదరీ! మీయెడల నేనేదియు దాచలేదమ్మా!

శార—(శిలనూపుచు) అవునవును. ఏదియు దాచలేదుగాని యేదియో కొంచెము దాచినట్లుగా నున్నయది.

సుశీ—ఏదియు లేదమ్మా! ఏవో కొన్ని పూర్వపుసంగతులు జ్ఞాపకమువచ్చినవి.

శార—ఓహో! అట్టులనా! తెలిసెను. నీవింతమాత్రమునకే చింత నొందవలెనా?

నీర—అక్కా! అన్నియు తెలిసిన దానవు నీవేయిట్లు చింతనొందుచుండ మావంటివారి మాటకేమి! కర్మానుఫలము తప్పదుగదా! అదిగాక! మనతండ్రిగారగు యోగానందులవారు తమ దివ్యజ్ఞానమువలనఁ గొద్దిరోజులకే తిరిగి మన సుదర్శనునివలన రాజ్యంబును బడయఁగలవని చెప్పలేదా? ఇంతమాత్రమునకే చింత నొందుద వేల?

సుశీ—నా చిట్టి తల్లులారా! మీరతిసుగుణవతులు. నిర్మలమై ప్రకాశించు మీ ముఖారవిందంబులఁ దిలకించ నా చింతలన్నియుఁ బారిపోవునుగదా!

నీర—(ఆలకించి) అక్కా! వింటివే! కోపల మృదుమధురస్వరంబున నేవిధంబుగా కోయని కూయుచున్నదో?

సుశీ—(చిఱునవ్వుదోప) ఆహా! నిజముగా నీ కంఠమువలెనే యున్నయది.

శార—(అలుగుచు) అవునవును. నీ వెప్పుడును నీరదనే మెచ్చుకొందువు. ఎన్న మాత్రము మెచ్చుకొందువా?

సుశీ—(నవ్వుచు) అయ్యో! నా వెఱ్ఱితల్లీ! నీ కంఠముఁగూడ కోవెల కంఠమువలెనే యున్నదిలే!

శార—అక్కా! మన సుదర్శనుని వివాహ మైనయెడల మేము మగ్గరమును నెన్ని యాటలనైనను నాడువారముగదా!

సుశీ—(నిట్టూర్పునిగిడ్చి) దైవవిధి నెవ్వరు తప్పింపఁగలరు! ఇంక వానికి వివాహకాల మాసన్నము మనదో? లేదో?

సిర—సాయంసమయము కావచ్చినయది. ఇంకను మన సుదర్శనుఁడు రాలేదేమి చెప్పుమా!

సుశీ—అవును. నేనుగూడ నదే విచారించుచుంటిని.

శార—అదిగో! మన సుదర్శనుఁ డిటకే వచ్చుచున్నవాఁడు.

(ప్రవేశము—సుదర్శనుం డతివిచారముతో)

—♦మత్తకోకిల♦—

మారుఁ డెంతయు జాలగా నను ♦ మాటిమాటికి బాణముల్
గూర్చిరుఁడై యహా! యెంతయోనియు ♦ గూలనేయుచు నుండెఁగా
భారమాయెను నాదుడెందము ♦ బాపురే యిక జీవముల్
దూరమాయె నికెట్టులోగద ♦ తోచదయ్యో నదేదియున్.

గీ॥ మారుఁడిట్టుల నన్నహా ♦ మాడ్చుచుండె
నామనం బయ్యొ యెట్టులో ♦ నోచుచుండెఁ
జెందరానట్టి దుఃఖముఁ ♦ జెందుచుంటి
నేమిసేయుదు నే నింక ♦ నెటులనైన.

ఆహా! నాకెందం బాసుందరీమణిని గాంచినప్పటినుండియు, మదనాయుత్రషీడితంబై బాధింపుచున్నయదిగదా! హా! రాజీవనేత్రా! హా! రాకేందుముఖీ!

ఉ॥ హా! కమలాయతేక్షణరో ♦ హా! నవమోహన మోహనాంగిరో
హా! కమనీయ చక్రకుచ ♦ హా! గజగామిని! నాఁటిసుందరీ

హా! కనకాంగి నీపలెను ♦ నందముగల్గినవారు లేరుగా!
నీకమనీయసుందరత ♦ నిండెను నాహృదయంబునందునన్.

కటకటా నాహృదయంబంతయు నంధకార పూరితంబై యేమియుం దోచకున్నదిగదా! ఆహా! నాశిరంబున బెద్దగుండొకటి పడినట్టుల నున్నయది. హా! జగన్మాతా! కాళికా! త్రిపురసుందరీ! ఏచింతయు లేకయున్న నా కావనితను స్వప్నమునందు గాన్పింపంజేసి, భక్తిభావంబగు నాహృదయంబును, కామవికారంబులచే నిండింపంజేసితివిగదా!—అయ్యో నాహృదయంబున నాసుందరముఖారవిందమును ఆదరహాసచంద్రికలు నాచక్రస్తనములు నామనోహర నయనము లెంతమరుతుమన్నను మరుపు రాకున్నవిగదా!—ఎక్కడరాజపుత్రి! యెక్కడనేను! రాజ్యపరిచ్యుతులమై యీయడవిని మునివాటికయందు వసించు మాకు కనకసౌధోపరిభాగంబున హంసతూలికా తల్పంబున శయనించి దాసదాసీజనంబుల సపర్యలంబొందుచునుండు రాజకుమారికలా లభియించుట? ఏమో దేవివాక్యంబు నిక్కువము గావచ్చును. హా! దైవమా! నన్నేమిచేయ నెంచితివోగదా! (అటునిటు జూచి) ఓహో! తల్లిగారిచ్చటనే యున్నవారు. నామాటల నేమైన వినలేదుగదా? (చెంతకేగి) తల్లీ! నీకోమరుండిదే నమస్కారంబును గావించుచున్నవాండు. (మ్రొక్కును.)

సుశీ—(చెంతకుదీసికొని) తండ్రీ! సుదర్శనా! కలకలలాడు నీముఖారవిందము నేడేలొకో వాడియున్నది. కారణమేమి?

సుద—జననీ! పూజ్యురాలవగు నీవు నాతల్లిగానుండ నాకేమికొదువ?

క॥ తల్లియె దైవము తలపగ
తల్లినిబోలంగ లేరు ♦ ధర నేహితులున్
తల్లికి సపర్యసలుపగ
నల్లనస్వర్గంబు కరత ♦ లామలకమగున్

చింతానివారణంబై మాతా! నిజముగా నిన్నుఁగాంచినంతనే నాహృదయమున భక్తిపూరితంబై యొప్పునుగదా! మరియు జననీజనకులకన్న బ్రియులైనవా రీభువనంబున నెవ్వరునులేరు. అందు జనని నవమాసములుమోసి, జన్మించినంతనే నతిప్రేమచే బెంచుచు పెద్దఁజేయునది. అట్టిజననిని దైవముగా నెవ్వరు తలంపరో వా రిహపరంబుల రెంటికిఁ జెడుదురుగదా?

సుశీ—కుమారా! నీవంటిపుత్రులు భరతభూమి నుదయింప నింకేమి కొదువ? నిజముగా నీవలెనే యందరు మాతృభక్తిపరాయణులై యుండిన భరతమాతపుణ్యమే పుణ్యముగదా? పుత్రా!

శ్లో॥ వర మేకో గుణీ పుత్రో । నచ మూర్ఖశతాన్యపి।
ఏకశ్చంద్ర స్తమోహన్తి। నచ తారాగణోపిచ॥

అనునార్యోక్తివలన నీవంటికుమారు లుదయించిన నింకేమి కావలయును?

నార—సుదర్శనా! నిజముగా సుగుణాకరుండవగు నిన్నుఁగాంచిన నెవ్వరికి నానంద ముదయింపదు!

నీర—అక్కా! ఏలయమ్మా మనసుదర్శనుని ముఖవికాసము తగ్గినది?

సుద—(తనలో) ఆహా! ఏమి యీ సుకుమారగాత్రులు! నిజముగా వీరినిఁ గాంచిన నాహృదయంబునం దొక విధమైన యాదరిప్రేమ ముదయించునుగదా! వీరిలావణ్యము, వీరిసరళత, వీరి చిల్కపల్కులు, వీరియాటలు, వీరిపాటలు, జూచిన నెవ్వరి హృదయంబు రంజించకపోవును! అందుకే మా తల్లిగారు చింతారహితమైయుండును. (ప్రకాశముగా) అమ్మా! నీరదా! నాముఖవికాసము తగ్గుట నీకుఁగూడ తెలిసెనా? అయ్యో! నీ వెంతసరళహృదయవమ్మా! నీకేమియుఁ దెలియదు. పాపము!

సుశీ—(సుదర్శనుని ముద్దిడుకొనుచు) కుమారా! నీరదయనినట్లులే నీముఖము కళావిహీనమై యొప్పుచున్నయది తండ్రీ!

గీ॥ ముదముతో నొప్పు నీచిన్ని ♦ మోముఁజూడ
నేలకో వాడిపోయెను ♦ నిజముచెపుము
యేల దాచెదవయ్య నా ♦ యెడల నింక
అది యెఱుంగఁగ దొందఱ ♦ నందుచుంటి.

సుద — జననీ!

ఉ॥ పిన్నట నాటనుండి నను ♦ ప్రేమను బెంచిన నాదు తల్లిరో!
యెన్నఁగరాని బాధల స ♦ హించియు పేర్మిమిడిఁ బెంచినావుగా
యెన్నఁగలేను నీయెడల ♦ నేఁటిక దబ్బఱ నెన్నఁడైన లో
నెన్నఁగరాని కోరికను ♦ నేహృదయంబున నెంతొ మించెడున్.

మాతా! మొన్నటిరాత్రి నాకు స్వప్నమునందు దేవి ప్రసన్నయై నా కొక సుకుమారసుందరశరీరను జూపి, యాసుందరీవృత్తాంతంబంతయు నాతో జెప్పి, నన్ను వివాహంబాడుమని యాజ్ఞాపించెను. ఆపడతితండ్రి వారణాశీపురంబునేలువాఁడట. ఆహా! కందమూలఫలంబుల భుజియించుచు నీఘోరారణ్యంబు నన్వసియించు మనకు కనకసౌధాగ్రపరిభాగంబున, మణిమయ స్థాపితంబగు డోలికల నూగుచు సుఖంబుగా రాజభోగంబుల ననుభవించు రాజపుత్రికలా లభించుట!

సుశీ — కుమారా! అట్లననలదు. దేవి చెప్పినమాట లెన్నటికిని నసత్యంబు గానేరదు.

సుద — జననీ! మన పురంజయునకు స్వప్నవృత్తాంతంబును విని, నేనెంత చెప్పినను వినక మీయాజ్ఞఁ గయికొనకయే యాతరుణీమణి వృత్తాంతంబును గనఁగోనటకై వెడలిపోయెను.

శార — నీరదా! నీరదా! అదిగో తండ్రిగారు పిలుచుచున్నారు. రమ్ము పోవుదము. (శారద నీరద — నిష్క్రమింతురు.)

సుశీ — అదిగో! మన పురంజయుం డిటకే వచ్చుచున్నవాఁడు.

(ప్రవేశము - పురంజయుఁడు.)

పురం—ఆహా! నేను పోయిన కార్యమేదో నెరవేరినయది. నేను ధన్యుండనయితిని. ఇంక నేను చూడవలసినది యొక్కటె! చంద్రికాసుదర్శనుల వివాహమును, రాజ్యపట్టాభిషేకమును. (ఎదురుచూచి) ఓహో! పుణ్యవతియగు సుశీలాదేవియును, నాప్రియమిత్రుండగు సుదర్శనుండును నిచటనే యున్నవారు. (చెంతకేగి) దేవీ! నీదాసుండిదే మ్రొక్కుచున్నవాఁడు. (సుశీలకు మ్రొక్కును.)

సుశీ—పురంజయా! ఆయుష్మంతుండవై వరలుము. నీవు పోయిన కార్యమేమొ నెరవేరినదా?

పురం—తల్లీ! మీ యాశీర్వాదప్రభావంబున నేకార్యము నెరవేరదు!

సుశీ—అయిన నీవు వెడలినప్పటినుండి జరిగిన వృత్తాంతంబు నాకు సవిస్తరంబుగా నెరిగించుము.

పురం—అమ్మా! నేను సుదర్శనునికిఁ జెప్పి వైద్యవేషంబున వారణాసిపురంబున కేగితిని. అచ్చట నే నొకనాఁడు రాచబాటపయిం బోవుచుండ, రాజభటులు నన్ను రాజకుమారీయంతఃపురంబునకుఁ దీసికొని వెళ్లిరి. నేనచ్చటికేగి చూడ నచ్చో రాజకుమారి మదనానలసంతప్తహృదయయై మూర్ఛపడియుండెను. అంతనే నొక మహౌషధముచే నాసుందరి మూర్ఛఁదేర్చితిని. నాకిదివరకే మన సుదర్శనునివలన నన్నిసంగతులు విశదమైనవి గావున నేను లేనిపోని కల్లబొల్లిమాటలఁ గొన్ని కల్పించి, నేను జ్యోతిషప్రభావంబున నన్నిసంగతులు గ్రహించితిననియు, నీమనోహరుఁడు మునివనవాటికయందున్నవాఁడనియు, నీకై పరితపించుచున్నవాఁడనియు జెప్పిన, నాసుందరి సంతసమందుచు, నీ తారహారంబును నామెడ నిడెను. ఇదిగో నీహారంబును గయికొనుఁడు. (తన జేబునుండి హారమునుదీసి సుశీల చేతి కిచ్చును.)

సుశీ—(హారముఁదీసికొని) కుమారా! నిజముగా మనపురంజయుని వంటి యుత్తముని నే నెందును గాంచియెఱుఁగను. మనకై యెన్నియో కష్టములఁబడి కార్యంబును సత్వరముగా నెరవేర్చె నుగదా! ఇదిగో! యీ హారమును దీసికొనుము. (హారమును సుదర్శనుని కిచ్చును.)

సుద—(తలవంచుకొని హస్తమును జాపును.)

సుశీ—పురంజయా! పాపము నీ వతిదూరప్రయాణముఁజేసి వచ్చితివి. భుజియించి కొంచెము విశ్రమింతువుగాని, రమ్ము.

(సుశీల నిష్క్రమించును.)

సుద—(హారము వక్షమునసిడికొని) ఆహా! హారమా!

మ॥ కమనీయంబగు కాంతినీనుచు గడు ♦ న్రామింపఁగాఁజేయుచుఁ
గమనీయంబగు గంధలేపముల నిం ♦ కన్ సౌఖ్యముల్ గూర్చుచున్
గమనీయంబగు మేనిసౌరుగల యా ♦ నాతీకుచాగ్రంబులన్
గమనీయంబగు నాటలాడఁగల భా ♦ గ్యంబందితో హారమా!

ఓ జలరుహనయనా! నీవక్షోజములపై నందముగా ధరియించు నీసుందర తారహారంబు నాహస్తంబుల నందుకొన నే నెంతటినోము నోచితినోగదా!

పురం—మిత్రమా! ఏల యీలీలఁ దొందరపడియెదవు. ఇంక మూఁడు దివసంబుల నీ కాసుందరీలలామసందర్శనముఁ గాక పోవునా? తినఁబోవుచు రుచుల నెంచెదవేల?

సుద—ప్రియతమా! పురంజయా! సుకుమారసారయాలలనామణి సౌందర్యంబును వర్ణించి నన్నానందపరుపుమా!

పుర—మిత్రోత్తమా! నిజముగా నాసుందరీయందంబు చతుర్ముఖుఁడగు నాపితామహునికైనను వర్ణింపఁ దరంబే? అయినను నాకు దోచినయంతమట్టునకు నేను వర్ణించెద వినుము.

ఉ॥ చూచితి నెల్లరాజ్యములఁ ♦ జూడగలే దెట నిట్టిసుందరి
న్జూచితి నెందరెందరినో ♦ చూడగలే దిక నిట్టికాంత నెం
దా చెలువస్తవంగొనిన ♦ నందముచందముఁ జెప్పరాదుగా
ని చెలువంబు నష్టగును ♦ నిక్కముఁ జూచిన మిత్రరత్నమా॥

మఱియు,

క॥ వనితామణి వాగ్బాణపులు
కనిన నహా! యెట్టివారి ♦ కైనను మదిలో
జనియింపదె తలపెట్టఁగ
వనితామణిపైన వలపు ♦ వారిజల నిషఁగ౯॥

ఉ॥ అష్టపుఁదళ్కుఁజెక్కులును ♦ నందముగా గనుపట్టుమోవియు
న్ముద్దులుగుల్కుపల్కులును ♦ మోదముతోడత నొప్పుబింబ మిం
కద్దర దానిచన్నులహా! ♦ యందము చందము నేమిచెప్పుదు౯!
ఇద్ధర నేవిధోలవుగ ♦ యింపగు నారము గుబ్బదోయికి౯॥

మిత్రమా! నిజముగా నాసుందరి సౌందర్యచందములకు తగినట్లుగా నుండును.

(తెరలో-కుమారా! సుదర్శనా! నాయనా! పురంజయా! పొద్దుపోయినది, భుజియింపరండు.)

పురం—మిత్రమా! అమ్మగారు పిలుచుచున్నారు. పద పోవుదము.

(పురంజయుఁడు సుదర్శనుని హస్తముఁబట్టుకొని తీసికొనిపోవును)

## ద్వితీయరంగము—మునివాటికోద్యానవనము.

(సుదర్శనుఁడు చంద్రశాలా వేదికపై విరహతాపముచే శయనించుట)

సుద—హా! ముగ్ధాయతాక్షీ! హా! నవమోహనాంగీ! పూర్ణచంద్రబింబంబునుబోలు నీముఖారవిందంబు నాహృదయకమలంబున నాచ్ఛాదించి మకరాంకుని క్రోధానలశరంబు లురంబునన్నాటి

నన్ను దుఃఖానలంబునం ద్రోసివేయుచుండెనుగదా! హా! నా
మనోహారిణీ! నీముఖచంద్రబింబమును నీప్రియుఁడగు నీ సుద
ర్శనుని కొకమారు చూపవా? అక్కటా! నాహృదయంబు
మదనజ్వాలానలకీలలంబడి మాడిపోవుచున్నయదిగదా! మద
నా! నాయెడల నీ కింతటినిర్దయ తగునా? యీవనవిహంగము
లారా! మీరైన నాప్రాణేశ్వరిజాడఁ గాంచితిరే? హా! లతా
గుల్మాదులారా! మీరైన నామనోహారిణిఁ గాంచితిరా? హా!
సరోవరమా! నీవైన నాప్రియురాలిఁ గాంచితివా? అయ్యో!
నేనేమిచేయువాఁడ! ఏవియు పలుకకున్నయవిగదా! ఓ నాప్రియ
తమా! నీవైన నాతోఁ బలుకవా?

ఉ॥ ఓ కమనీయగాత్రి విక ♦ చోత్పలలోచన! కంబుకంఠి! నో
నీకమనీయసుందరత ♦ నీటుగ నాయెడఁ జూపవేగ రా
వే! కరుణింపవే! యికను ♦ వేచక నన్నిటు చేరఁదీయవే
నీకమనీయమౌ నధర ♦ నిస్తులమాధురి నానఁ జేయవే!

మదనా! మదనా! ఏల యీలీల నన్నుం గాయఁజొచ్చెదవు.
ఆహా! ఏమి యీయింతిసౌందర్యము! నిజముగా యక్ష కిన్నర
గరుడ గంధర్వాదులకైనను నట్టిసౌందర్యంబు గలదో! లేదో!
కటకటా! నే నింక తాళఁజాల.

సీ॥ ఏతావ్రపర్ణమఁ గొన్న ♦ నిజగన్నోత్రహానా
కారమే కన్నట్టు ♦ కఱ్ఱుపుఁ గాంచి
నచ్చోటఁ గాంచిన ♦ నసుందరియె నాకు
నింపుమైకన్నట్టు ♦ నెంతగానో
నేవంకఁ గనుఁగొన్న ♦ నీసరోజాస్యరమె
కన్నట్టు నెంతయుఁ ♦ గడఁగంతోఁడ
నేలట్టుచూచిన ♦ నీచంద్రవదనయే
కమనీయగాత్రియై ♦ కానపించు
తే॥ ఎటులసైతును నేనింక ♦ నేమిసేతు
కాముఁ డింతయు కలుషటా ♦ కరుణలేక

గీ॥ పాలనున్నట్టి మీఁగడ ♦ పట్టియనఁగ
పాలకడలిలోఁ బరఁగెడి ♦ పద్మమనఁగ
నీలమౌ నింగినిం దెలి ♦ నిగ్గులెసఁగ
వలరుచుండెను చందురు ♦ డాకసమున॥

ఓ! ఇందీవరనయనా! ఇంకనైనను వేగరమ్మా! నన్నుఁ బ్రోవుమా! అరెరే! కందర్పుఁడేయు నిశితబాణంబులఁ దాళలేకుంటినికదా!

క॥ చిక్కఁడు చేతికి ఖడ్గము
చిక్కదుగా యేమిసేతు ♦ [illegible]
చిక్కిన నాహృదయంబును
జక్కఁగ ఖండించుకొనిన ♦ జక్కం[illegible]గా॥

హా! దైవమా!

గీ॥ మారుఁడెంతయుఁ గ్రూరుఁడై ♦ మాన్పుచుండె
తాళఁగాలేను నేనయో ♦ తాళలేను
జీవములఁ బాసినను నాకు ♦ నింత బాయు
కటకటా చిక్కదయ్యెను ♦ ఖడ్గమైన॥

ఓరీ! మదనా! నీవతిపాపుండవు. మా పాలిటి యముడౌతివలె మా ప్రాణంబులఁ దీయుచుంటివి. ఇంక నీకెవ్వరును దొరకలేదుగావలయును. నీవు పట్టిమూర్ఖుడవు. నిన్నుంబోలిన ధూర్తుఁడీ ధరావలయంబున నెందును లేఁడు. ఓరీ! పాపీ! నీవెట్టి మోహంబున అలనాఁడా త్రినేత్రునియెడఁ జూపి, జ్వాలానలకీలలఁబడి మాడిపోయియు తిరిగి నీవెకిలితనంబుల మావంటి వారియెడఁ జూపించుచుంటివిగదా! కటకటా!

ఉ॥ ఓరిదురాత్మ యోకలుష ♦ మోయధమాధమ నీవు నిట్లయో
ఆరయ బాణజాలముల ♦ నన్నిటు బాధలఁ బెట్టుచుంటివా?
క్రూరుడ నన్ను నిక్కరణి ♦ గోడులఁ బెట్టక బ్రోవరాదురా?
నీరజనేత్రపుత్త్ర యిక ♦ నిన్నెరనమ్మితి నామనంబునన్॥

ఓయీ! మదనా!

సీ॥ ఈయింతి నాకింక ♦ నింపుగాఁ గూర్చిన
మణులఁ బూజించెద ♦ సమ్మతితోడ
ఈసతీమణి యింక ♦ నింపుగాఁ జేర్చిన
ముత్యాలపేరుల ♦ మొనసి యిత్తు
ఈసుందరీమణి ♦ నిచ్చిన నాకింక
పుష్పమాలల నిన్నుఁ ♦ బూజసేతు
ఈ కనకాంగిని ♦ నింపుగాఁ గౌఁగిలిఁ గూర్పఁ
గనకహారంబులఁ ♦ గానుక నిత్తు

గీ॥ ఇట్టి యాత్మీయభక్తి ♦ నింపు మీఱ
గూర్చి నీకింక నిత్తు ♦ గొప్పకముల
నన్ను నా ప్రాణసఖిఁ గూర్పుమా ♦ నందగింపగ
నలినదళనేత్రపుత్ర! స ♦ న్మాన్యపాత్ర!

(అటునిటుఁ జూచి) ఆహా! నామిత్రుఁడగు పురంజయుఁ డింత వరకును రాలేదేమి చెప్పుమా?

(ప్రవేశము—పురంజయుఁడు.)

పురం—ఓహో! ఇంకను సుదర్శనుఁడు శయనించలేదేమి? (సుదర్శనుని చెంతకేఁగి) మిత్రమా! ఏల నీవింకను శయనింపకున్నవాఁడవు?

సుద—ఓహో! పురంజయా! నీవా? నేను శయనింపకపోవుటకుఁ గారణమా? మఱేమియు లేదు. కాంతావియోగానలజ్వాలలంబడు నాకింకెక్కడి నిద్ర!

పురం—సుదర్శనా! ఏల యీలీలఁ దల్లడిల్లి వాపోయెదవు? ఊరడిల్లు మూరడిల్లుము.

సుద—అయ్యో! నా ప్రియమిత్రమా! శోకాగ్నిశిఖలను నొందుచున్న నా హృదయం బెవిధంబుగా నూరడిల్లును. మఱియు మందహాస చంద్రికల విరజిల్లు నా సుందరీసుందరవదనారవిందంబు నా

(ప్రవేశము—చంద్రశర్మ, పురుషవేషధారిణియగు కమలయును.)

చంద్రి—కమలా! ఈరేయి నిచ్చటనే గడపి, రేపుదయమున లేచి, మన రాజకుమారునకై విచారింతము గాక.—అబ్బ! ఆకలిచే కడుపంతయు మాడిపోవుచున్నయది.

కమ—ఆహా! చల్లనగు నీ వృక్షములనుండి మలయానిలుఁ డేతెంచుచు హృదయంబు నేవిధంబుగఁ జల్లఁగఁజేయుచున్నాఁడు. (ఎదురుఁ జూచి) అదిగో! మన చెంత కెవ్వరో వచ్చుచున్నట్లున్నవారు.

చంద్రి—అవును. నాకుఁగూడ నట్లే తోఁచుచున్నయది.

పుం—(చంద్రశర్మ యొద్దకేతెంచి) అయ్యా! మిమ్ములఁజూడ విప్రుల వలెఁ దోఁచుచున్నవారు? మీరెవ్వరో మాకెఱిఁగించి మమ్ముల సంతసపరుపుఁడు.

చంద్రి—అయ్యా! మేము విప్రులము. నా పేరు చంద్రశర్మయందురు.

పుం—(తనలో) ఏమిది. ఈతనిపేరు చంద్రశర్మయా. ఇతఁడు విప్రుఁడా? ఇతనిముఖము నే నెచ్చటనో చూచినట్లున్నయది. (జ్ఞాపకము నభినయించి) ఓహో! ఇతఁడు నా బాల్యస్నేహితుఁడగు చంద్రశర్మ కాఁడుగదా? ఏమో యొకపేరు, నొక ముఖమును గోలినవా రెత ముందలేరు!

చంద్రి—ఏమో యాలోచించుచుంటి రేల?

పుం—మరేమియు లేదు. ఏదో నాకుకొన్ని పూర్వపుసంగతులు జ్ఞాపకము వచ్చినవి. మీనివాసస్థలం బయోధ్యాపురంబా?

చంద్రి—(తనలో) ఓహో! ఏమి యాశ్చర్యము! నా యునికిపట్టీతని కేవిధంబునఁ దెలిసినది? (ప్రకాశముగా) అయ్యా! నా నివాసస్థల మయోధ్యాపురంబని మీ రెట్లు గ్రహింపఁగలిగితిరి?

పుం—(తనలో) ఓహో! ఇతఁడు తప్పక నా బాల్యస్నేహితుఁడగు

చంద్రశర్మయే! (ప్రకాశముగా) చంద్రశర్మా! నీవు నన్నింకను గుర్తింపలేదా!

చంద్ర—ఆహా! ఏమిది పురంజయా! పురంజయా! నీవేనా? నీవేనా! (కౌఁగలించుకొనును)

పుర—ఆహా! మిత్రమా! మన మెన్నినాళ్లకుఁ గలిసికొంటిమి!

కమ—(తనలో) ఏమిది! నే నితని మున్ను నిదివర కెచటనో చూచి నట్లు జ్ఞాపకమున్నయది. (జ్ఞాపకము నభినయించి) ఓహో! యితఁడు మాసఖిచెంతకు వైద్య వేషంబున వచ్చినవాఁడు కాఁడు గదా!

చంద్ర—పురంజయా! మన సుశీలాసుదర్శనులసంగతి నీకేమయినఁ దెలియునా?

పుర—వా రిచ్చటనే యున్నవారు.

చంద్ర—ఏరేరీ! వారినొక్కసారి నాకన్నులకుఁ బ్రదర్శింపఁజేయించి నన్నానందపరుపుము.

పుర—సుశీలాదేవి యిప్పుడు పరుండి యుండును. (సుదర్శనుఁ జూపి) అదిగో అతఁడే మన సుదర్శనుఁడు.

సుద—(అరుగుపైనుండి లేచి) ఏమిది! మా పురంజయుని నొకక్రొత్తపురుషుఁ డెందులకో కౌఁగిలించుకొనుచున్నవాఁడు? పరికించిజూడ నే నిదివరకెచటనో చూచినట్టి జ్ఞాపకమున్నయది. ఏమయియుండును నామనసంతయు నాందోళనముగా నున్నయది. ఏదేవరై యుండవచ్చునోగదా!

పుర—(సుదర్శనుని చెంతకేతెంచి) ఇదిగో! మన చంద్రశర్మఁ గాంచితివా? ఆహా! ఎన్నినాళ్లయినది మనమితనిఁ జూడక? మనము ముగ్గురము చిన్నతనంబున నెన్నియాటలనైన నాడువారము.

సుద—ఏమేమీ! యితఁడు చంద్రశర్మయా? ఆహా! ఎన్నిరోజులయినది!

యితనిని జూడక (చంద్రశర్మ యొద్ద కేగించి) మిత్రమా! చంద్ర
శర్మ! మనమిన్నినాళ్లకుఁ గలిసికొనుట దైవసంకల్పమేసుమీ!

చంద్ర—ప్రియతమా! సుదర్శనా! నీకొరకై నేనెన్ని కష్టములఁ బడి
యైన నిన్ను జూచినందుకు సంతసించితిని.

కమ—తనలో ఓ...! ఇతఁడేనా సుదర్శనుఁడు! ఔరా! ఏమి వీని
చక్కదనము. నిజముగా నింతటి యందగానిని నేనెందును
జూచియెఱుఁగనుగదా! ఈ సుదర్శనుడు మా చంద్రికకుఁ
దగినవాఁడే

పుర—(కమలను చేతఁజూపి) మిత్రమా! చంద్రశర్మ! ఈ క్రొత్త
పురుషుఁడెవరు?

చంద్ర—ఇతఁడును మనకు మిత్రుఁడే.

పుర—ఓ స్వామీ! ఈ క్రొత్త మిత్రుఁడు నీకెచట లభియించెను.

చంద్ర—నాకుఁ దోవలో లభియించెను.

సుద—(తనలో) ఏమిది! ఇతనియాస్యనవ్యసహావభావంబులఁ గాంచిన స్త్రీ
వలెఁ దోచుచున్నయది. పురుషుఁని మా చంద్రశర్మ నుడువు
చున్నవాఁడు. ఇదేమి చిత్రమోకదా! (ప్రకాశముగా కమలం
జూచి) అయ్యా! మీ నామధేయమెయ్యది?

చంద్ర—మిత్రమా! సుదర్శనా! ఇతనినామధేయము భీమసేనుఁడం
దురు. ఇతఁడు చంద్రికాసఖియగు కమలసోదరుఁడు. నిన్నుఁ
గనుగొన వచ్చినవాఁడు.

సుద—ఓహో! అయిన నితఁడును మన ప్రియస్నేహితుఁడే!

పుర—(తనలో) ఇతనిఁ జూడ స్త్రీవలెఁ గన్పట్టుచున్నవాఁడు. సుంద
రమైన ముఖచంద్రబింబమును జూడ నాకు కమలవలెఁ దోచు
చున్నయది. కాని, ఇతఁడు పురుషుఁడో, స్త్రీయో, తరువాత
కనుఁగొనెదనుగాక!

సుద—(పురుషవేషధారియగు కమలంజూచి) మిత్రమా! విశేషము లేమి? .

కమ—విశేషము లేమియు లేవు. చంద్రిక మీనిమిత్తమై మదనబాణ పీడితయై నిరీక్షించుచున్నయది.

సుద—హా! మన్మనోహారిణీ! చంద్రికా!

గీ॥ కటకటా! నాదుకొఱకు నీవు ♦ కష్టములను
బడుచు నుండుచునుంటివా? ♦ పద్మనేత్రి!
యెంతకూరుఁడ నేనౌదునో ♦ యిటులనిన్ను
బాధపెట్టుచునుంటిని ♦ పాపమనక॥

ఆహా! తరువాత—తరువాత?

కమ—మా రాజుగారగు విక్రమకేతుఁ డిదివరకే స్వయంవరమును చాటించిరి. ఇంకను స్వయంవరము నాలుగురోజులు వ్యవధిగా నున్నయది. అప్పుడప్పుడే మా పురమంతయు రాజపుత్త్రులచే నిండిపోయినది.

సుద—ఆహా! ఎంతకష్టం బెంతకష్టంబు! హా దైవము! నా ప్రాణేశ్వరి యెంత దుఃఖించుచున్నదో కదా!

కమ—మా చంద్రిక దుఃఖించుటఁగని నా సోదరియగు కమల మీజాడ నరయుటకై నన్నంపినయది.

పురం—కమ (అనబోయి) మిత్రమా! భీమసేనా! మా సుదర్శనుఁడు రేపే వారణాశీపురంబునకుఁ బ్రయాణము కానున్నవాఁడు. (చంద్రశర్మంజూచి) ప్రియమిత్రమా! రాత్రి చాల యతిక్రమించిన యది. రా రమ్ము పోయి పరుండము. (చంద్రశర్మ, పురంజయులు నిష్క్రమించుచున్నారు.)

సుద—(కమలంజూచి) మిత్రమా! నీవు క్రొత్తవాఁడవైనను నీతియుక్తమైన మాటలచే నెల్లప్పుడును నా మనసము నీతో మాటలాడఁగోరును.

అయ్యో! నీ వెప్పుడైనను జంద్రికళను జూచితివా! ఆకలికి నన్నెప్పుడైనను దలంచునా? ఆసుందరీసుందరత నాకు విని పించి నావీనుల నానందపరుపుచుము.

కమ — (చిఱునవ్వాననసీమం దోప) నిజముగా నాసుందరీమణి సౌందర్యమింతింతయన వీలుకాదు. మన్మథప్రియాంగనయైన యా రతీదేవి యాసుందరీలలామ కాలిగోటికైనను సరిపోలదు. ఆహా!

తే॥ గీ॥ కమలదళనేత్ర చిన్నారి ♦ కలికిమిన్న
యందములపంట సుందరి ♦ హంసయాన
మరునిపూబంతి బంగారు ♦ ప్రితిమయైన
నీకె తగుగాదె యాయింతి ♦ నిజముగాను.

మఱియు ఆ కలికి యెల్లపుడును నీసుందరవిగ్రహమును దలంచుచు మకరాంకుని క్రోధానలశరంబుల శరీరంబును కృశింపఁజేసికొనుచు మదనతాపంబును భరింపలేక కటకటంబడుచు "హా! నాప్రియా! హా! మన్మనోహరా! హా! సుదర్శనా! నిదాసినగు నిచంద్రికళం బ్రోవరాదా" యనుచు తల్లిదండ్రులును, దాసదాసీజనంబులును, తనప్రియచెలులును నెంతయోదార్చినను నూరడిల్లక యాహారాదుల ముట్టక కృశించి పోవుచున్నయది.

సుద — హా! ప్రియసఖీ! చంద్రికళా! నాకై నీవెంత పరితపించుచుంటివి! (కమలంజూచి) మిత్రమా! భీమసేనా! నాప్రియాంగనవృత్తాంతంబును వినినప్పటినుండియు నామనంబంతయు డోలాందోళనము నొందుచున్నయది. కటకటా! నాకన్నులు తిరుగుచున్నవి! నాతలయు దిరుగుచున్నయది. హా! చంద్రికళా! చంద్రకళా! అయ్యో! అయ్యో! నేను తాళలేకుంటిని. (క్రిందబడి మూర్ఛిల్లును)

(తెర పడిపోవును.)

(ప్రవేశము: కమల స్త్రీవేషముతో)

కమ——ఏమిచిత్రమో గాని పురంజయుని జూచిననాటనుండి నామనంబు
నన్నుఁ జూచినప్పటినుండి పురంజయునిముఖమును పూర్తిగా
మారిపోయినవి. నే నతనిని జూచిన నామనంబున నొక విధ
మైన మోహం బాతనియెడ నుదయించుచున్నయది. ఇతనిని
జూడ నాకు అలనాడు మా చంద్రకళయొక్క కేతెంచిన వైద్యుని
వలెఁ గన్పట్టుచున్నవాఁడు. నాయనుమానమునకు తగినట్లు
నితం డొకమారు నన్ను "కమల" యనబోయి "కమ" అని
తిరిగి 'మిత్రమా!' యని పలుచుటఁజూడ నన్నితఁడు గుర్తించి
నట్లు దోఁచుచున్నయది. నిజముగా నితని సుందరముఖారవిం
దమును, వాక్చాతుర్యమును, సొంపును జూచినప్పటినుండి నాఁడ
మందు మదనబీజాంకురము మొలచినయది. సుదర్శనుఁడు
నన్నుఁ బురుషుఁడనియే తలచుచున్నవాఁడు గాని పురంజయుఁడు
మాత్రము నన్ను స్త్రీగానే తలంచుచుండెను. తడయుచుచు
కానీ! కానీ! నన్నితఁడు మోసపుచ్చవలెనని తలచినట్లున్న
వాఁడు. నిజముగా నేనే యీతని మోసపుచ్చుచున్న కమలను
గాను! (ఎదుటదిలకించి) అదిగో! పురంజయుఁ డిటకే వచ్చు
చున్నవాఁడు. నేను తెరచాటునకేగి యితని చర్యలన్నియుఁ గని
పెట్టెదఁగాక. (తెరచాటున కేగును.)

(ప్రవేశము పురంజయుఁడు)

పురం——ఆహా! అనువిన్పుడు పురుషుని మోముఁ గాంచిన యాలనాఁడు నేను
వైద్యవేషంబునఁ గాంచిన కమలమోమువలెఁ గన్పట్టుచున్న
యది. ఇతండు తాను కమలసోదరుఁడనని నుడువుచున్నవాఁడు.
అదెంతమాత్రమును గాన ట్లితని హావభావంబులే చెప్పక చెప్పు
చున్నయవి.

కమ——(తెరచాటుననుండియే) ఏమీ! నాహావభావములు స్త్రీలవలె
నున్నయవియా! ఏమి యీ చిత్రము!

పురం—(తలయూపుచు) నే నీకమలను వైశ్యవేషంబునఁ జూచిననాట నుండియు నామనంబు తమి నీసుందరీలలామయెడ నాటుకొనినది.

కమ—(తెరచాటున నుండియే తలయూపుచు) ఆహా! నిక్కట్టు బైటఁ బడెనుగదా!

పురం—నిజముగా నీకమలను బొందినవాని జన్మమే జన్మముగదా! ఈసుందరగాత్రిని జూచిననాటినుండియు నా మనంబంతయు దాని యెడనే నాటుకొని నాటినుండియు నన్నాహారంబులే రుచింపకున్నయవి. కటకటా! నామనంబంత యణఁగద్రొక్కుదమన్నను కామోద్రేకపీడితంబై యణఁగకున్నయది. ఈభీమసేనుఁడు తప్పక కమలనేయని యెంచుచున్నవాఁడు. (తలయూచుచు) కానీ! కానీ! దీనివిషయమై పూర్తిగా విమర్శించెదను. (అటు నిటుఁజూచి) ఆహా! ఏమిది! యెన్నఁడునుగాంచని యాకారం బొకటి నాకు దృగ్గోచరం బగుచున్నయది.

(ప్రవేశము: భూతవేషధారియగు కమల.)

కమ—ఆహా! ఎవరురా! ఎవరురా! భూత, ప్రేత, పిశాచ, యక్ష, కిన్నర, గరుడ, గంధర్వ, సుర, సిద్ధ, సాధ్యుల కలవిగానిమదీయ క్రోధానలజ్వాలానికలల కన్నుపడువాడు! (పురంజయుఁ జూచి) ఓరీ! దుర్మదాంధా! యౌవనప్రాభవమున గన్ను మిన్నుఁగానక యిట్టిదేవతలకైనఁ జొరశక్యముగాని యీచోటికేమో కాలూనఁ దలచుచుంటివి. ఇయ్యది పిశాచాధిపరాగోపురము. నాసంభవయుక్తుఁడగు హిడింబుని వోలని యెఱుఁగవలరా? నిన్నిప్పుడే నాయుదరపోషణార్థమై నాపొట్ట నిడుకొందును.

పురం—(గడగడవడఁకుచు, చేతులు జోడించుకొని పాదంబులఁబడి) స్వామీ! ఇద్దాసునితప్పుల మన్నింపఁ బ్రార్థింతును.

కమ—ఓరీ! క్రూరాధమా! తప్పులఁజేసి పైనుండి నాకుఁ దక్కులఁజూప వచ్చెదవా! నిన్నిప్పుడే నాపొట్టఁబెట్టుకొని భుజించెదఁ జూడుము.

పురం—(వణకుచు) స్వామీ! ఇయ్యది వినాశకాలంబని యెఱిఁగిన విట్టి కూఁతలఁ గూయకపోవుదునా. ఇంక నాతప్పులు మన్నించి వేగము కాపాడుఁడు.

కమల—(పకపక నవ్వుచు) ఔరా! అధమా! తప్పులఁజేసి మన్నించు మనెదవా?

పురం—తండ్రీ! 'దాసునితప్పు దండముతో సరి'యనునటుల నాతప్పు లింకనైనను మన్నించి వేగమే కాపాడుఁడు.

కమ—(భూతవేషమును తీసివేసి స్త్రీవేషధారియై పకపక నవ్వుచు) పురంజయా! పురంజయా! నన్ను మోసపుచ్చనెంచి నీవే మోస పోయితివిగదా!

పురం—ఓహో! కమలా! కమలా! నీవెంతటి మాయలాడివి! (తనలో) నామాటల నేమియు వినలేదుగదా! (ప్రకాశముగా) కమలా! భీమసేనవేషధారివై నన్నే మోసపుచ్చితివి గదా! నిజముగా నీవంటి చతురురాలి నేనెందును గాంచి యెఱుఁగనుసుమీ!

కమ—(నవ్వుచు) నన్ను నీవు మోసపుచ్చనెంచి నాచేతనే మోసపోయితివిగదా!

పురం—కమలా! నామాటలనన్నియు వింటివా?

కమ—వినిననేమి? నీ గుట్టంతయుఁ బయటఁబడ్డదిలే!

పురం—మన సుదర్శనునికి నీవు కమలవని తెలియునా?

కమ—తెలియకేమి! నే నప్పుడే సుశీలాదేవితో నన్నిసంగతులఁ దెలిపితిని.

పురం—అమ్మా! నీవెంతటి చతురురాలవు!

(తెరలో—'కమలా! కమలా!' యని పిల్పు వినబడును.)

కమ—అదిగో! సుశీలాదేవి నన్నుం బిలుచుచున్నయది, నేను బోవల యును.

పుర—(కమలహస్తములఁ బట్టుకొని) ఇదిగో! ఒకమాట విని పొమ్ము.

కమ—నన్నింక విడువుము, నేను పోవలయును. (చేయి విడిపించుకొని పాఱిపోవును)

పురం—ఆహా! ఈసుందరిహస్తం బెంతటి మృదువైనది! ఇవ్వాలిత మాటలాడు మాటలఁజూడ నన్నుఁ బ్రేమించినదనియే తోచు చున్నది. కాని దైవవిధి యెటులున్నయదో తెలియదు. నిజ ముగా నీసుందరి నాకు లభించిన నేనే ధన్యుడను.

(నిష్క్రమించును)

(తెర పడును)



శ్రీ రామచంద్రాయనమః.

# చంద్రకళాస్వయంవరము

## చతుర్థాంకము



రంగము - కాళికాలయము.

(చంద్రిక తనచేత పుష్పములపుటికను గొని కమలతో ప్రవేశించును)

కమ—ప్రియసఖీ! అల్లదే కాళికాలయము. రమ్ము, పోవుదము.

(ఆలయముగుమ్మమునొద్ద కేగుదురు)

చంద్రి—(దేవిమీద పుష్పంబులను నుంచి భక్త్యాంజలియై) ఓ! జననీ!

—♦ మత్తకోకిల ♦—

నిన్నె నమ్మితి నెల్లయప్పుడు ♦ నీరజేక్షణ ప్రోవుమీ
సన్నుతామరలోకపూజిత ♦ సర్వలోకశరణ్య నా
నిన్నె యెల్లగ పూజసేతును ♦ నిర్మలంబగు భక్తితో
గ్రన్నన న్నను గావవే సద ♦ కంజలోచన శాంకరీ.

ఓ! జగన్మాతా! భవదీయపాదారవిందంబుల నెంతయు సద్భక్తి మాలనగు నాకు నామనోహరుని దివ్యసుందరవదనారవిందము చూపిన నానందపడుదును. ఓ మాతా! చిన్నప్పటినుండియు నిన్ను సేవించుచు నీనామంబును విడనాడక, యెల్లప్పుడు నీపాద

యుగళంబుల మదీయహృదయకమలంబుల ధ్యానించు నీదా
సురాల నగు నాకు నాకోర్కె లీడేర్చ నీకొక లెక్కయా?
తల్లీ! ఇంకనైనను నాకోరిక లీడేర్చి నన్నానందపఱుపుమా!
ఓదుర్గా! నిశక్తిసామర్థ్యంబు లీధరావలయంబంతయు నిండి
యున్న నీకు నాకోరికలఁదీర్చి నన్నానందపఱుచు టొక
లెక్కయా?

కమ—అమ్మా! చంద్రికా! భగవతి నీకోర్కెలఁ దప్పక నెరవేర్చు
ను. లెమ్ము. ఆతల్లి కరుణార్ద్రహృదయ.

చంద్రి—(ఈవలికివచ్చి) కమలా! నామనోహరుఁ డెప్పుడు వచ్చునే?

కమ—సఖీ! చంద్రికా! ఏల తొందరపడెదవమ్మా! నీమనోహరుని
జాడ నంతయు పురుషవేషధారినై నే నరసి వచ్చితిని. అతఁడు
నేఁడో, రేపో రాఁగలఁడు. ఇంత తొందరయేల? ఇంకను వివా
హము రెండుమూఁడురోజులవ్యవధి యున్నయదిగదా.

చంద్రి—అయ్యో! అతఁడు వచ్చునని యేమినమ్మకము? ఒకవేళ
రాకున్న ప్రాణములు పరిత్యజించుటయేనా?

కమ—నీవు వట్టి వెఱ్ఱిదానవు. నీ కెంత జెప్పినను వినవు.

చంద్రి—నా ప్రియసఖీ! నిజముగా నీవంటి యుత్తముగాలిని నేనెం
దును గనలేను. నాకై శ్రమయునక నామనోహరునిజాడ
నరసివచ్చిన ని న్నెంతని కొనియాడుదును!

కమ—అయ్యో! నాపిచ్చితల్లీ! ఇంతకే నన్నింత కొనియాడవలయు
నా? నీకై ప్రాణమాగ్నినైనను బడుదును.

చంద్రి—ఆహా! నీవంటి సఖీమణులు నాచెంతనుండఁగ నాకేమికొదువ!
నీవు నాకై పొందినశ్రమకు నీకు కృతజ్ఞతనుజూప నామొద్ద
నేమియు లేవుసుమా!

కమల—(ఎదుటఁజూచి) అమ్మా! చంద్రికా! ఎవరో యిటకే వచ్చు
చున్నట్లున్నయది. మాటలాడ కూరకుండుము,

(ప్రవేశము: మునివేషధారియగు సుదర్శనుఁడును పురంజయుఁడును)

పురం—మిత్రమా! చూచితివా? అల్లదిగో! కానవచ్చుచున్నయదే! అల్లదియే చంద్రికాసుందరమందిరము. ఆహా! ఏమి యీ భవనసౌందర్యము!

చ॥ తలతలమంచు కుడ్యములు ♦ దంతపురంగుల నీనుచుండె న
త్యలఘుతరైకశోభలను ♦ నందముఁగుల్కఁగ రంగులీనుచు
స్ఖలిత మనోవిలాసమయి ♦ రమ్యముగా గనుపట్టుచుండు నీ
కలకలలాడు సౌధమును ♦ గాంచిన వాంఛ జనింపకుండునే!

అల్లదిగో! ఎవరో వనితలు మనదిక్కే చూచుచున్నవారలు.

కమ—(సుదర్శనుఁ జూపుచు)

మ॥ కలికీ! కాంచితివే యదే మునిసఖా! ♦ కాషాయవస్త్రంబుల
న్గలవాఁడై యరుదెంచుచున్ నిగలనా ♦ సదంబుతో వచ్చెడి
స్థలమందు స్థిరియించిపేరుల కిరం ♦ బ్రస్నోల్వ శిష్యుండు తా
సిలపై జారిన మారుఁడో యనఁగ నో ♦ యిందీవరాక్షీ! యటం॥

చెలియా! కనా! సుందరాకారుఁడగు నీమునినిఁ జూచిన నే. వనిత వలపదు!

చంద్రి—కమలా! కమలా! ఇతఁడంతయు నామనోహరునివలె గన్పట్టుచున్నవాఁడు. ఆహా! ఆసుందరముఖారవిందమే, యీ సుందరముఖారవిందము. ఆనయనములే యీనయనములు. ఆ యొయ్యారములే యీ యొయ్యారములు. ఆహా! సత్యముగా నితఁడు నా మనోహరుఁడే యనవచ్చునుసుమీ!

కమ—(తనలో) ఇప్పుడే యితఁడు సుదర్శనుఁడని తెలిపిన బాగుగా నుండదు. (ప్రకాశముగా) ఒకరినిఁబోలినవారొకరుందురు! ఇతఁడాతం డెంతమాత్రమును గాఁడు. నీమనోహరుని నే నిదివఱకే చూచివచ్చితిఁగావున నా కాతఁడు బాగుగా దెలియును. ఇతఁడేదో మునివరేణ్యుఁడుగాఁ దోఁచుచున్నవాఁడు.

పోయి నమస్కరింతము రమ్ము. (సుదర్శనుని చెంత కేతెంచి) మునికులచంద్రా! ఇదే మా రాజకుమారియగు చంద్రికళ మీకుఁ బ్రణమిల్లుచున్నయది.

పుర౦—(సుదర్శనునితో మెల్లగా) మిత్రమా! ఈసుందరియే చంద్రికళ సుమా!

చంద్రి—మునికులోత్తమా! ఇదే మీదాసురాలగు చంద్రికళ నమస్కరించుచున్నయది. (నమస్కరించును.)

సుద—(చేయి నెత్తి) ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు! (తనలో) ఆహా! ఏమి యీ చిల్కలకొల్కి చిక్కపల్కులు సుధారసంబు లొల్కుచున్నయవిగదా! ఈసుందరి మృదుహాస్యపద్మములు నాపాపంబుల నంటు నాహృదయంబు జల్లుమనియెను. ఆహా!

సీ॥ ఈయింతితోడుత ♦ నింపుగా నొంపుగా
రతికేళిఁ దేలెడి ♦ రమణుఁ డెవఁడొ
ఈనతిమణి నింక ♦ నింపుగా కౌఁగిలిఁ
జేర్చఁగ నెవ్వఁడు ♦ చెలఁగునొక్కొ
ఈసుందరీమణి ♦ యింపొంద మోవిని
ముద్దిడ నెవ్వాని ♦ పున్నె మొసఁగు
ఈజగన్మోహిని ♦ యెవ్వైనకో ప్వాను
బట్ట నెవ్వానికిఁ ♦ భాగ్యమొకొ
సుందరీమణితోడుత ♦ సుందరముగ
నాటలాడఁగ నెవ్వఁడు ♦ హాయిపొందుచు
నిలలోనను వసించు ♦ నెవ్వఁడో
అతనిదే భాగ్య మిమ్మహి ♦ నరసిచూడ॥

చ॥ కలికిమిటారిచన్నులును ♦ గాంతులునెను ముఖారవిందము
న్బ్రౌఢిమమైన [illegible] ♦ చక్కని చూపులు లేతనవ్వులున్

జిలుకలపల్కులు నవ్వరియు ♦ చిన్నని మోవియు చిన్ననడ్కలున్
ఇలపయి నిట్టిసుందరిని ♦ నెందును గానగలేదు దైవమా॥

కమ—మునివరేణ్యా! యోచించుచుంటి రేల? మాసఖి యిచ్చునాతిథ్యంబుం బుచ్చుకొని మాడెందము లానందపరుప వేడుచున్నదాన. (చంద్రికఁజూచి) అమ్మా! చంద్రికా! మునిచంద్రుని కాతిథ్యంబును నిచ్చిన నతఁడు మసలను కరుణించి మన యిష్టార్థంబుల నెరవేర్చును.

సుద—సుందరీ! నీ సఖురాలును, నీవును నిచ్చునాతిథ్యంబు లెరోజును దప్పక పుచ్చుకొనియెదము.

కమ—అమ్మా! చంద్రికా! మునిచంద్రుని యాతిథ్యంబునకుఁ బిలువవేమి?

చం—(మాటలాడక యూరకుండును.)

పుర—అమ్మా! చంద్రికా! నీవిచ్చు నాతిథ్యంబును మాయయ్యవారు తప్పక పుచ్చుకొనియెదరులే!

కమ—చెలీ! సిగ్గేలనమ్మా! మనలయెడనా సిగ్గు! సిగ్గుపడకవాడి మునిచంద్రుని యాతిథ్యంబునకై పిలువుము.

చం—(హస్తాంజలియై) మునికుల తిలకా! భక్తితో మత నే నిచ్చు నాతిథ్యంబును బుచ్చుకొని, నన్నానందింపఁ జేయ వేడుచున్నదానను.

సుద—(తనలో) ఆహా! కలికీ! నీ ప్రేమాస్పదంబైన యాతిథ్యంబును నోసికొన నేనెంతటి ధన్యుండనోగదా! (ప్రకాశముగా చిఱునవ్వానననీమఁదోప చంద్రికఁజూచి) సుందరీ! నీవిచ్చు నాతిథ్యంబును దప్పక ప్రేమపాత్రుండనై పుచ్చుకొనియెదను. నీ కింక సంతసమేనా?

చం—(పైటచెఱంగును చేతనందుకొని సిగ్గుచే దలవంచుకొనను)

కమ—మునిచంద్రా! ప్రొద్దుపోయినది, రమ్ము పోవుదము.

సుద—(తనలో) ఆహా! ఈసుందరిఁ బొందినవాని జన్మమే జన్మంబు గదా! (పైకిఁజూచి) హా! దైవమా! దీనబంధూ! ఈసుందరీ లలామ నెవ్వరివనితగాఁ జేయుదువో గదా!

పుర—(మెల్లగా) మిత్రమా! ఇప్పుడు విచారించిన ఫలము లేదు. రా రమ్ము, పోవుదముగాని.

(అందఱు నిష్క్రమింతురు)

---

ద్వితీయరంగము-ఉద్యానవనము.

(మునివేషధారియగు సుదర్శనుఁడు.)

సుద—ఆహా! ఈవాల్గంటిఁ గాంచినదిమొదలు నామంబంతెయు మన్మథావసలం దేలుచున్నయది. కట్టా! దైవము నాకీకాంతఁ గూర్చునో లేదో? ఆహా! ఈసుందరి యంచనడకలును, చిల్కపలుకులును, సుధాబిందువు లొలుకు సుధాకరబింబ సదృశ ముఖకమల మును, రాజీవదళంబులఁబోలు నయనంబులును, వెన్నెలల వెదజల్లు దరహాసంబులును జూడ నా మనఃకమలంబంతెయు యారాకేందుముఖనే కోరునుగదా! ఆహా! ఏమి యీయువతి సౌందర్యంబు!

గీ॥ భామగాదిది మరునిచే ♦ బంతిగాని
పడతిగాదిది బంగారు ♦ ప్రతిమగాని
కలికిగాదిది రతనాల ♦ కలికిగాని
వనితగాదిది వలపుల ♦ బరణిగాని!

మ॥ పదియార్వన్నె పసిండిబంతియగు నీ ♦ భామామణిన్గాంచిన
న్మదియెల్ల న్మదనాగ్నిబాణములచే ♦ మాడంగపాచ్చున్గదా
యిదియేస్వర్గమటంచు నామనము నీ ♦ యిందీవరాక్షిన్ గనన్
మదియెల్లప్పుడు నీరజాముఖినె నా ♦ నందంబుగాఁ గోరెడిన్॥

క॥ ఈకలికివాలుచూపు ల
నేకలికికనయసుగలవ ♦ యీాధర మెందుం

ఈకలికనిజూచిన మది
యీకలికనె చేరఁ జెందఁ ♦ మంతయుఁ గోరున్॥

మఱియు,

చ॥ కలికిముఖారవిందమును ♦ గాంచిన నెవ్వఁడు బాళిజెందఁడే?
తెలుపఁగదీని సొయగహా! ♦ తెద్దయు మానులు మోహమందరే?
యలికులవేణిపైన యథ ♦ నార్ద్రితఁగాంచిన జిల్కలెంతయుం
కిలకిలయంచుఁ జేరఁగద ♦ కిన్నరకంఠి ముఖాంబుజంబునన్.

(అటునిటు జూచి) నే నీమునివేషధారుఁడనై చెలఁగుచు, ఇట్టి కామాతురంబైన మాటలనాడుట నెవ్వరైన వినినయెడల బ్రహ్మాండంబుగా నుండఁగదా? కటకటా! నామనంబెంత యూరకొందమన్నను నూరకొనకున్నయది. నే నేమిసేయువాఁడను ఈకలికి నాకు మొదటిరోజున జేసిన సపర్యలచే నాడెందం బానందాంబుధిఁ దేలిపోవుచున్నది. ఆహా!

గీ॥ సుందరి సపర్యలనుబొంది ♦ సుఖముగాను
పాన్పుపైనను నెంతయు ♦ బవ్వళింప
నతఁడె నిజముగ నౌనుగా ♦ యఖిలమునకు
భోగియనఁగను బరగఁడె ♦ పుడమియందు.

(యెదురఁజూచి) ఆహా!

ఉ॥ నా రతనాలమూటయఁట ♦ నాఁపుఁజన్నులు పైఁటలోపల
న్నారవమొప్ప నాటలను ♦ గంతులిడంగను మాటిమాటికి
న్నేరగదీయుచున్నయటుఁ ♦ జిల్కలపల్కుల మాటలాడుచు
న్నీరజనేత్రియదిగో ♦ సొబగుగల్గున మోహిగవచ్చెడిన్॥

ఆహా! గంధసింధురయాన బంగారుమంజీరంబులు గల్లున మ్రోగ హస్తకంకణకింకిణీరవంబులెంతయో నవీనసంగీతరవంబులఁ గొల్ప డెందం బానందాంబుధిఁ దేలఁగ, తన చెలిమికత్తియ యగు కోకిల వెంటరా హంసగమనంబున నిదే వచ్చుచున్న

యుఁడి. ఈసుందరీమణి వచ్చినకొలఁది కమలాకరుని కిరణప్రసార కమలంబులపగిది మన్మనఃకమలం బంతకంతకు వికసించుచున్నయది. ఇంక నే విరహతాపంబోంకుచు నూరకే వాపోవుచుండిన ప్రమాదముగా నుండును. (తలవంచుకొని జపమాలఁ ద్రిప్పుచుండును.)

(ప్రవేశము: చంద్రిక, కమల.)

కమ—సఖీ! చంద్రికా! అదే మునివరుఁడు ధ్యానైకతత్పరుఁడై యున్నవాఁడు. పోవుదము, రమ్ము. (ముని చెంతకుఁ దీసికొని వెళ్ళును.)

చంద్రి—(తనలో) ఆతనిఁగన్న నాహృదయంబు ప్రేమోదయము వాచున్నయది. ఆహా! ఇంతటి సుందరాకారుని నేనెందును గానలేదుకదా! ఈ సుందరముఖారవిందుని యందంబును, కమలదళంబులఁబోలు కనులును, గండుతుమ్మెదలఁబోలు చిన్ని మీసంబులును, నీలేనగవులును జూచి నా మనంబెల్లప్పుడును సుందరాంగుని సుందరచంద్రబింబంబునే చూడఁగోరును. కట్టా! మునివేషధారుఁడగు నీతనిఁజూచిన నేకాంత వల్వదు! ఆహా! ఈ యువతీమనోహరుని, ఈ నవమోహన మోహనాంగుని, ఈసుందరాకారునిఁ జూచిననాటనుండియు నామనంబు కామోద్రేకపీడితంబై యేమియుఁ దోచకుండెనుగదా! ఆహా!

ఉ॥ కంతువసంతులన్దెగడు ♦ కాంతు నెనుచు నొప్పుచుండు న
వింతమునీంద్రునిన్గనిన ♦ వింత మనంబునఁ దోచు నెంతయో
చింతల నామనంబునను ♦ నిస్తులనంబున నీతఁ డిట్లయో
కాంతులనీను దేహమును ♦ గష్టము పెట్టఁగ నేమిచిత్రమో॥

మఱియు,

ఉ॥ ఎంతయు నామనంబునను ♦ నీతనిఁగాంచిననాఁటనుండియున్
సంతతబాణజాలముల ♦ సారెకుసారెకు మారుఁడక్కటా

చింతల హెచ్చుచేయుచును ♦ జెప్పగరాని వియోగ బాధల
న్నెంతయు నాయెడ న్గరుణ ♦ జూపక యేయుచునుండె గ్రూరుఁడై॥

క్షమ — చెలీ! ఏమో యోచించుచుంటివేల?

చంద్రి — మరేమియును లేదు. నామనోహరుఁ డింతవరకును రాలే దేందులకో? యని యోచించుచుంటిని.

క్షమ — అయ్యో! నాపిచ్చితల్లీ! (చిఱునవ్వు నవ్వును)

చంద్రి — ఏమీ! నవ్వెద వెందులకు? (అలుక చే) నామాటలనిన నీకు నవ్వులాటలుగదా?

క్షమ — నాప్రియసఖీ! నీవు వట్టిబేలవుసుమీ! మునిచంద్రుని నివాసస్థలమైన యిచ్చోటఁగూడ నీమనోహరుని ధ్యానంబును విడువలేదుగదా యని నవ్వితినిగాని పరిహాసించుటకు గాదు.

సుద — (కన్నులను విప్పి) నారాయణా! నారాయణా! నారాయణా! నారాయణా!

క్షమ — స్వామీ! మాచంద్రికకుఁ గోరినవరుఁడు లభించునా? లేదా? తమ దివ్యజ్ఞానమువలనఁ గనుఁగొని చెప్పుఁడు.

సుద — (యోచన నభినయించి, వ్రేళ్లు లెక్కపెట్టుకొని, చంద్రికఁ జూచి) వాల్గంటీ! నీకిష్టమైన పుష్పంబు నొకదానిని గోరుకొనుము.

చంద్రి — (సిగ్గుచే తలవంచుకొని) పంకజములు.

సుద — (చిఱునవ్వానన సీమ దోప చంద్రికముఖముఁ జూచి) సుందరీ! నీవు పంకజంబులఁ గోరితివి. అయ్యవి మదనాయుధంబులు గావున మకరాంకుఁడు నీమనోకోరికఁ దప్పక నెరవేర్చును. మరియు నే దివ్యజ్ఞానంబుచే నీమనోహరుని జాడనరసితిని. అతఁడీయూరనే యున్నవాఁడు. నేఁడో, రేపో నిన్నుదప్పక వివాహం బాడును.

చంద్రి—(సిగ్గుచే నవనతవదనయై యూరకుండును)

కమ—మునివరేణ్యా! మీకు కావలసిన సపర్యలు మాచంద్రికళ యొనరించుచుండును. నే నిప్పుడే తిరిగివత్తును. (చంద్రికళతో) చెలీ! చంద్రికళా! నే నిప్పుడే తిరిగివచ్చెదను. నీ వీమునివరేణ్యుని కేమికావలయునో యిచ్చి వారిమనంబును సంతసంపరుపుము. (నిష్క్రమించుచున్నయది)

చంద్రి—మునిచంద్రమా! మీ కేమికావలయునో చెప్పిన, సత్వరంబుగాఁ జేయుటకు, మీదాసురాలగు కళ యిదే నిరీక్షించుచున్నది.

సుద—(తనలో) ఆహా! నామనోహారిణీ! నా కేమికావలయునో యడుగుచుంటివా? కలికీ! సుధారసంబులొలుకు నీయధర చుంబనముఁ దప్ప నా కేమికావలయును? సుందరీ!

ఉ॥ నీచిఱునవ్వు వెన్నెలలు ♦ నీనిగ్గుసెక మిటారిచూపులు
న్నీ చెలువంపుకాంతులును ♦ నీయధరంబుననున్న పెంపుమీ
నీ చినిచిల్కపల్కులును ♦ నీదు మిటారపు జిన్నినడ్కలు
న్జూచినఁ దన్పవే మనము ♦ నుం జెలి నాకిక యేమికావలె.

(ప్రకాశముగా) కొమ్మా! నాకుఁ గావలసినవేమియు లేవు. అదిగాక సుకుమారసుందరశరీరవు. నీకుఁ బనులఁజెప్పిన నలసిపోవుదువు.

చంద్రి—మునీంద్రా! ఇంపాదసన్నిధానముండుండి మీకు సపర్యలఁ జేయవలయునని నాడెందం బూరకే కోరును.

సుద—సుందరీమణీ! నీమాటలచే నీపర్యలచే మాడెందం బానందం బందెను. నీ వతిసుగుణగణ్యవు. నిన్నుఁబోలినవా రీధరామండలి నెందును లేరు. ఇప్పుడు నా కేమియు నక్కరలేదు. పూజానిమిత్తంబై నీసుందరసుకుమారహస్తంబులఁ బుష్పులఁ గొన్నిటిఁ గోసికొనిరమ్ము.

చంద్రి—(తలవంచి) చిత్తము. (నిష్క్రమించుచు తనలో) కట్టా!

దైవమా! ఇట్టి సుందరమూర్తిని, కచ్ఛడాల్గట్టుకొని, పవన పర్ణాంబుభక్షకుఁడై యడవియందు వసియించు మునులతోఁ గలిపివేసితివే! నిన్నేమనందును? ఆహా! అచ్చము నామనోహరునిచందంబున నొప్పు నీయందకాన లేనగవులును, తేనె లొల్కుపల్కులును నీసుందరాకారమును జూడ నామనంబంతయు నీతని సౌందర్యాంబుధినే తేలియాడుచు, మకరాంకుని పంచాయుధంబులఁ గటకటంబడి చెందరాని దుఃఖంబుల జెందునుగదా! మరియు,

చ॥ ఇతనివిలాసవైఖరులు ♦ నీతనిలోనన చంద్రబింబముల్
ఇతని విశాలవక్షమును ♦ నీతని నీలపు చిన్నిమీసముల్
ఇతని లసద్విలాసములు ♦ నీతని యందము చందమెంతయు
న్నతతము గాంచగావలయు ♦ నంచు దలంచును నామనం బహా!

ఆహా! ఇతండు నామనోహరుండిందే యున్నవాఁడనియు, నేడో, రేపో నన్నుఁ దప్పక వివాహమాడుననియుఁ జెప్పియుండెను. కట కటా! నామనోహరుని వివాహంబాడుదు ననుమాట నాకెంతమాత్రమును నమ్మకము లేదు. వివాహము నేటికింకను రెండురోజుల వ్యవధిగా నున్నయది. నామనోహరునిజాడ నా కింతవరకును దెలియలేదు. మునివేషధారుఁడగు నీతఁడే నామనోహరుండు కాడుగదా? ఏమో? ఒకవేళ నన్ను మోహింపఁజేయుటకై యీ మునివస్త్రంబులఁ దాల్చనోపును. వీనిచక్కదనమును, వీని విలాసంబులఁ జూడ, రాకొమరుని వలెనే దోచుచుండెనుగాని, మునివలె నాకుఁ దోచుటలేదు. మరియు,

ఉ॥ ఆ దరహాసచంద్రికలు ♦ నా కమనీయపు మోవిచందముల్
ఆ దయఁజిల్కుచూపులును ♦ నాసుధలొల్కెడు చిన్నిపల్కులున్
శ్రీదగునాథ్యు నీతని బొంరింగన నామనమందు నక్కటా!
యేదియు దోచదయ్యెగద ♦ యేమియొనర్తునో యింక నేనహా!

సీ॥ ఈసుందరాకారు ♦ నీక్షింప నామది
మదనుండు కటకటా! ♦ మాడ్చుచుండె

ఈనవమోహాను ♦ నీక్షింపనెంతయో
నామది మరు: డయో! ♦ నలపజొచ్చె
ఈమోహానాకారు ♦ నీక్షింప నన్నయో!
యంగజుం డెంతయో ♦ యడపఁజొచ్చె
ఈజగన్మోహాను ♦ నీక్షింప నెంతయో
కందర్పుఁ డక్కట! ♦ కాల్చుచుండె
గీ॥ కటకటా! మారుఁడెంతయు ♦ గరుణలేక
మనము నడలంగ నన్నయో! ♦ మాడ్పఁజొచ్చె
నెటులసైతును నేనింక ♦ నేమిసేతు
మునివరుంగను టేమి నా ♦ మోహామేమి?
అయ్యో! యెవ్వరైనవిన్నను ♦ నహహా! నగరె?

(అటునిటుఁజూచి) అయ్యో! దైవమా! కామాయత్తపీడితం బైన నాహృదయంబంతయు డోలాందోళనము నొందుచు, మునివరేణ్యునికిఁ బుష్పంబులఁ గోసికొనివచ్చుటయే మరచి పోయినది. పాప మతఁడు నాపుష్పంబులకై నిరీక్షించుచుండ వచ్చును. వేగముపోయి పుష్పంబులఁ గోసికొని మునివరేణ్యున కొసంగెదను. (నిష్క్రమించుచున్నది.)

సుద—కట్టా! కలికి వెడలిపోయిన నా హృదయంబంతయు నంధకారసమన్వితంబై యేమియుఁ దోచకుండెనుగదా! హా! దైవమా! యీ తరుణీమణిని నా యర్ధాంగిఁగాజేసి నన్నెప్పుడు సుఖపెట్టెదవో గదా! ఆహా! ఈ సుందరీలలామ యందచందంబులఁ గనుఁగొనిన నా కన్నాహారంబులే రుచియింపకున్నయవి? ఇవ్వాల్గంటి నాచెంతనుండ నామనంబంతయు స్వర్గసౌఖ్యం బనుభవించినట్టు లుండునుగదా! ఆహా!

చ॥ ముదముగనొప్పు నీసుదతి♦ముద్దులగుల్కెడు నిందుబింబము౯
అధరము నందచందమును ♦ హంసలఁబోలెడి చిన్నినడ్కలు

స్పదయుతలీలతోడ నొప్పుచును ♦ నందముగా కనుపట్టునేత్రముల్
మది వసియించుగా నెపుడు ♦ మానక యీసతిసారుఁ గాంచినన్ ॥

సీ॥ ఈ సుందరీమణి ♦ యెవ్వాని యర్ధాంగి
యగునో వానిదైభాగ్య ♦ మరసిచూడ
ఈ లలనామణి ♦ నిష్టమొందగ సుఖ
మందఁజేసెడివాఁడె ♦ యతులసుకృతి
ఈ జగన్మోహిని ♦ యింపొంద, పల్కుల
సంతసింపఁగ జేయు ♦ సరసుఁడెవఁడొ
ఈ చెలిమిన్నను ♦ నింపుగా సంతస
మొందఁజేసెడి భాగ్య ♦ పురుషుఁడెవఁడొ?

గీ॥ నళినదళనేత్రి నీచాన ♦ నందముగను
మోదమున ముద్దులనెలి ♦ ముదముతోడ
నెంచ మానందమొందగ ♦ నింపుదీర
సరసహాసామ్రాజ్య పదవిని ♦ సల్పునెవఁడు?

మఱియు,

ఉ॥ బంగరుగిన్నెలో యనగఁ ♦ బయ్యెదచాటున నిక్కినిక్కుచు
న్బంగరువన్నె బోలుచును ♦ భాసురరూపముతోడ నొప్పుచున్
బంగరుబొమ్మ బొంగరపుఁ ♦ బయ్యెదలోపలి చన్నులెంతయున్
బంగరురంగు లీని కడు ♦ భావజుబారికి సన్నఁజేర్చెడిన్ ॥

సీ॥ అతివచన్నులుఁబోలు ♦ నందంపుగిండ్లను
లేమకన్నులుఁబోలు ♦ లేళ్ళకనుల
చాన మోమునుబోలుఁ ♦ జక్కనిచంద్రుండు
తొడరుమోవినిబోలు ♦ దొండపండు
చానచూపులుఁబోలు ♦ జక్కని హరిణంబు
యతివనడ్కలుఁబోలు ♦ హంసనడల

గీ॥ పడతిఁబోలును బంగారు ♦ బంతియంత
కలికిమేనంత పోలును ♦ కాంచనముగ

నలివ యందంబుచందఁబు ♦ నరసిచూడ
బోలవేవియు నింక నీ ♦ పుడమియందు॥

చ॥ అతివ మెరుంగుటందియల ♦ యందములైన రవంబులెంతయు
న్నతతము పల్కుపల్కులకు ♦ నందముఁగొల్పెడి వీనిఁబోలె, నా
సతి కమనీయకంకణపుఁ ♦ జక్కిఁకిణి శబ్దజాలము
ల్నతతము పల్కుపల్కులను ♦ జక్కగ నా హృదయంబు జొచ్చెడిన్॥

అహో! నా హృదయంబంతేయు నీ రమాకుణి సుందర సౌందర్యాంబుధి ద్రోలి యాచక్రిస్తని చక్రిస్తన మధ్యంబున నాటుకొని తిరిగి రాకున్నయది. కటకటా! యీ సుందరి యంగసౌందర్యము, యీ యొయ్యారి కులుకుపలుకులు, ఈ సుందరాంగి చిఱునవ్వులును గసినప్పటినుండియు నామనంబున నేమి చేయుటకును దోచకున్నయది. ఆహా! ఈ నవనీతహృదయను, నీ సుధాకరముఖిని, నీ పద్మగంధిని నా హృదయంబునఁ జేర్చుకొని సుఖించు టెప్పుడోగదా! (ఎదుటఁజూచి) ఓహో! ఆసుందరమందయాన మందగమనంబుల నిటకే వచ్చుచున్నయది. ఇంక నిటుల విరహవేదననొందుట బాగుగానుండదు. (సవరించుకొని) నారాయణ! నారాయణ! నారాయణ! నారాయణ!

(ప్రవేశము చంద్రికళ)

చం——ఓహో! ఇతఁ డింకను పరాత్పరధ్యానైకమానసుఁడై యున్న వాఁడు. (చెంతకేగి) ఇదిగో! పుష్పంబులఁ దెచ్చితి, గైకొనుఁడు. (పుష్పముల సమర్పించును.)

సుద——(పుష్పంబులఁ దీసికొని పూజావిధానంబొనర్చి) పూఁబోఁడీ! మాయొసంగు పుష్పంబుల మాహస్తంబున నీకొప్పున ధరించు కొనిన, నీకు మనోహరసుందరసుకుమారశరీరుఁడగు వరుఁడు

లభియించును. కోమల్మా! రమ్ము. నీశిరంబున నీ గులాబీపుష్పం బుల నుంచెదగాని.

చం—(లజ్జావనతవదనయై పయ్యెదకొంగును జేతులఁబట్టుకొని యూరకుండును.)

సుద—సుందరీ! అడవుల జరించుచు కందమూలాదిఫలంబుల భుజియించు మావంటి మునులయొద్దనా నీసిగ్గరితనము? రా రమ్ము.

చం —(చెంతకేగి శిరంబునువంచి నిలువఁబడును.)

సుద—(తన హస్తంబుననున్న పుష్పంబులను జంద్రికళశిరంబున ధరించి, తనలో) ఆహా! ధన్యోస్మి! ధన్యోస్మి! నాహృదయకమలం బిప్పటికిఁ జల్లఁబడ్డయది. నా హస్తంబులు పావనంబైనవి. నా దేహంబు సార్థకంబైనయది. ఆహా! ఏమి యీ సుకుమార సుందర సిలశిరోజములు! నిజముగా నియ్యదియే నాకు సుదినము! (ప్రకాశముగా) వాల్గంటీ! ఇంక నీ మనోహరుఁడు నీకుఁ దప్పక లభించును.

చం—(తనలో) ఏమిది! ఈతని హస్తంబులు నా శిరంబున నుంచగానే నాయొడలు ఝల్లుమని పులకాంకురంబులయ్యెను. ఆహా! హృదయమా! నీవంటి మూర్ఖపుదాని నేనెందును గాంచి యెరుంగను. కట్టా! పవిత్రుఁడగు నీమునివరేణ్యునెడనా నీమోహము? ఛీ! ఛీ! నీవెంతటి నీచమైనదానవు!

సుద—(మందస్మితవదనారవిందుడై చంద్రికళముఖమును జూచి) మరాళయానా! నీవు వరించినపురుషుఁ డెట్టివాఁడు? వాని పేరెయ్యది? వాని రూపరేఖాదుల వర్ణించి నాకుఁ జెప్పుము.

ఉ॥ ఎవ్వఁడు నీమనోహరుఁడొ ♦ యింపగురీతిని నాకుఁ దెల్పుమా
యెవ్వనిదాన నీ వికను ♦ నెవ్వనిమూర్తిని నీదుడెందమం
దెవ్వనిమూర్తినుంచితివి ♦ యెవ్వని కింపగుదాన నీ వహో
యెవ్వనియందు నీ కికను ♦ నిప్పుడుతెల్పవె లోలలోచనా॥

ఓ కమనీయగాత్రీ! నీసుందర సుకుమారశరీరం బెవ్వనియాధీనం బవునో? నాకుఁదెలిపి నావీనుల నానందపరుపుము.

చంద్రి—(తనలో) ఏమీ! ఇతఁడు నామనోహరుని యందచందంబుల వర్ణించుమని జెప్పుచున్నవాఁ డేమికారణము చెప్పుమా! అయిన నేమి? పెద్దవారడుగుచుండఁ జెప్పకపోయిన బాగుగా నుండదు. నామనోహరునిజాడ యీతని కేమైనఁ దెలిసియుండనోపును. (ప్రకాశముగా) మునికులతిలకా! పెద్దలగు మీరడుగుచుండ జెప్పకపోవుట భావ్యముగాదు. నేనొకనాఁడు శయనించి యుండ మత్కాళీపూజాఫలంబున నొక సుందరసుకుమార శరీరుని వీక్షించితిని. ఆసుందరాకారుని సుందరసందర్శనముచే మన్మనంబాతనియు నాసుందరలలామునియెడ నాటుకున్నయది. ఆహా! సౌందర్యరాశియగు నాతనియందం బేమనివర్ణింతును!

గీ॥ అతనియందంబు వర్ణన ♦ కలవిగాక
శేషశయనుండు జలమున ♦ జేరినాఁడు
శేషుఁడెంతయు భూమి పై ♦ జేర్చినాఁడు
నాకు నాతని వర్ణింప ♦ నలవియగునె॥

ఉ॥ ఆతనిమోము నచ్చముగ ♦ నందముఁగొల్పెడి చంద్రబింబముల్
ఆతనిముంగురుల్ గనిన ♦ నందము లొప్పెడి నీలవర్ణముల్
ఆతనికన్నుల న్గనిన ♦ తద్దయుబోలుచు పంకజంబులన్
ఆతని కాతఁడే తగును ♦ నందమునందున బోల నిమ్మహిన్॥

మఱియు,

క॥ అనఘుడ! నాకనియెను నొక
యనఘుఁడు నానందమంది ♦ యాతనిపేరుల్
వినయముతోడుత నిట్టుల
ననఘుని నామము సుదర్శ ♦ నాఖ్యుండనుచున్॥

మునిచంద్రా! అతఁడిప్పుడు తన పినతల్లివలన రాజ్యపరిచ్యుతుండై తన జననితో నొక మునివనవాటికయందుండెనని కూడ వినియుంటిని. మహాత్మా! అతనిజాడ లేమైనఁ దమకుఁ దెలిసినయెడల నాకెఱింగించి నావీనుల నానందపరుపవేఁడుచున్నదానను.

సుద—సుకుమారీ! నీమనోహరుఁడు నీకుఁ దప్పక లభియించును. నీ వెంతమాత్రమును జింతిలకుము. ఆతనిని నేను దివ్యజ్ఞానమువలన గనుగొంటిని.

చంద్రి—మునీంద్రా! ఆతనిని మీరు వీక్షించితిరా?

సుద—అతని నేను జూచితిని. రూపరేఖావిలాసాదులంతయు నావలెనేయుండును. రూపములో నతఁడే నే ననుకొనుము.

చంద్రి—(తనలో) ఏమిది! అతఁడే నేననుకొమ్మని నుడువుచున్నవాఁడు. ఇతనిమాటల జూడ నాకత్యాశ్చర్యము గలుగుచున్నయది. (హృదయముపై జేయివేసికొని) హృదయమా! తొందరపడకుము. (తిరిగి మునిఁజూచి) నిజముగా రూపరేఖాదివిషయంబుల నామనోహరునిఁ బోలియున్నవాఁడు. నాప్రియుఁడే యిట్టి మునివేషంబును వేసియుండడుగదా! ఆహా! నాదేహం బెంతయు చెమటచే తడిసిపోయినది, నామేనంతయు పులకాంకురంబులెత్తినయవి. నానోట మాటరాకున్నయది. నాయొడలు గడగడలాడుచున్నయది. కటకటా! నామనంబంతయు యంధకారబంధురంబై యేమిసేయుటకును దోఁచకున్నయది. (ప్రకాశముగా) మునికులతిలకా! అతఁడున్నచోటు మీ రెఱుంగుదురా?

సుద—అతఁ డీవనంబునందే యున్నవాఁడు.

చంద్రి—ఏమిచిత్రము! అతఁడిందున్న నాకేందులకుఁ గనఁబడఁడు?

సుద—(తనలో) పాప మీసుందరి నన్నింకను మునిచంద్రునిగా తలంచు

చున్నయది. ఈరమణీమణి నన్నుఁదప్పక వలచినట్టుల మాటల వల్లఁ దెలియుచున్నయది. కాని యీవనితకు నానామంబెరిఁగించి నీమనోహరుండను నేనేయని తెలిపెదను. అటుపైనఁ దైవమే గలఁడు. (ప్రకాశముగా) కలికీ! పాపము! నీ వెంతటి బేలవు! నీవింకను ముగ్ధరాలవుసుమీ! నీకేమియుఁ దెలియదు, వా ల్గంటీ!

ఉ॥ సారసనేత్రి నిన్నెపుడు ♦ జాలగ మారుని బాణపంక్తితో
నూరక యేచుచు న్మదిని ♦ నొక్కటనేచుచునుండునట్టి యా
పారుఁడు దుర్మదాంధుడును ♦ పాపి సుదర్శనుఁ డెంతయేని
యే నారయ వీడెసుమ్మి యిక ♦ నంబుజపత్త్రిసమాననేత్రిరో॥

(చంద్రికకళహస్తముఁ బట్టుకొని)

ఉ॥ నారతనంపుబొమ్మ! నిను ♦ నాలలనామణి! నాదు సుందరీ!
ఓరమణీమనోమణిరో! ♦ ఓకనకాంగిరో! మోహనాంగిరో!
సారసనేత్రి నే విరహ ♦ సంతపనంబున కోర్వలేను న
న్నేరగదీసి ప్రోవుమిదె ♦ నాసుకుమారవు సుందరీమణీ॥

ఉ॥ ముద్దులగుమ్మ నిన్నుఁగన ♦ మోహము హెచ్చుచు నుండె నన్న హా
తద్దయు కౌగలించి యిక ♦ తాపముదీర్పవె చిన్ని చేతుల
న్ముద్దులనొల్కు పల్కులను ♦ నో కమలేక్షణ! మాటలాడవే
యిద్ధర నీదుసుందరత ♦ యెవ్వఁడు జూచిన జొక్కకుండునే॥

హా! సుకుమారీ! మాటలాడవేమి? నేనేమైన నీయెడలఁ దప్పు గావించితినా? కలికీ! సుధారసంబులొలుకు నీచిల్కపల్కుల నీమనోహరుఁడగు నీసుదర్శనుని నానందపరుపుము. నిలవేణి! ఏల యీలీల యూరక బేలవై నాతో మాటలాడక కూరకుండెదవు?

చంద్రి—(తనలో) ఆహా! ఏమీ చిత్రము! ఇతఁడేనా నామనోహరుడు? ఆహా! ఇన్నిరోజు లితనికి సపర్యలఁజేయుచు ఇతఁడే మన్న

నోహరుడని నే నెఱుంగలేకపోయితినిగదా! అమ్మా! నేనెంత మోసపోయితిని. (ప్రకాశముగా) మునిచంద్రా! శ్రీరమానాథసుందరపాదారవిందభజనానందకందళితహృదయారవిందులగు మీ రిట్టికోరికలుఁ గోరుటిది వింతగదా! ఇకనైనను నా హస్తములవదలి నన్నుం బోనిందు.

సుద—అయ్యో! ప్రాణేశ్వరీ!

గీ॥ నీదు సౌందర్యసీమను ♦ నేను జూడ
నిట్టి వేషంబు వేసితి ♦ నిజముగాను
మారు డయ్యయొ నన్నల ♦ మాడ్చుచుండె
నింకనైనను బ్రోవవే ♦ యిందువదన॥

చంద్రి—(సిగ్గుచే చేయి విదలించుకొని నటునిటుఁజూచి) అదుగో, యిటకెవ్వరో వచ్చుచున్నట్టున్నయది. (పారిపోవును)

సుద—(తలపై చేయినిడుకొని) హా!

సీ॥ నాముద్దులమిటారి ♦ నాకుల్కులకటారి
నాముద్దుసుందరి ♦ నాదురమణి
నాపుణ్యములపంట ♦ నాబంగరపుబొమ్మ
నాపుష్పములబంతి ♦ నాదుకోవ
నాచిన్నిసుకుమారి ♦ నాయందములపంట
నాబంగరపుదొంతి ♦ నాదులేమ
నాయన్నువులమిన్న ♦ నాసుందరపుమూర్తి
నాసొగసులహయారి ♦ నాదువనిత

గీ॥ అకట జీవములన్నియు ♦ నపహరించి
పాసిపోయెను కటకటా ♦ పద్మనేత్రి
నేను నిట్టుల నింక నీ ♦ నెలమిపైన
ప్రాణములనిల్ప యయ్యయో ♦ మాడజాల॥

హా! పరమాత్మా! నేనిక తాళలేను. హా! కలికీ! చంద్రికా! చంద్రికా! అయ్యో! అయ్యో! నేనేమిసేయువాడన?

రా రమ్మి. నేను నీమనోహరుండనే. అయ్యో! నాపై కోపమా? పోకుము. పోకుము. నేనిదే వచ్చుచుంటిని.

(నిష్క్రమించును)

## తృతీయరంగము — సౌధము

(పద్మావతీ విక్రమకేతు లొకసౌధముపై నుండుట)

విక్రి—కలికీ! మనపట్టి స్వప్నమునం దొక పురుషవరేణ్యునిఁగాంచి యాతని వరించినదని నాకుఁ దెలియవచ్చినయది. కటకటా! మొదలే నా కీవృత్తాంతంబు దెలిసినయెడల నే నిస్స్వయంవరమునే చాటింపకుందునుగదా! స్వయంవరమునకై రాజవరేణ్యులందరును విచ్చేసిరి. నాకెట్టిపనిఁజేయుటకును కాళ్ళాడకున్నయవి. ఇవియన్నియుఁజూడ మనరాజ్యమే మనకు నిలుచునట్లు తోచుటలేదు.

పద్మా—ప్రాణేశ్వరా! మనరాజపుత్రి స్వప్నమునం దొక పురుషవరేణ్యుని వరించినట్టు నాకుఁగూడా కమలవలనఁ దెలియవచ్చినయది. ఆతఁ డిప్పుడు మన యుద్యానవనమున మునివేషధారియై యున్నవాఁడని వినియుంటిని. అతనికి మనకళనిచ్చి రహస్యముగా వివాహంబొనరించిన నటుపైన నేమయినఁగానిమ్ము.

విక్రి—ఏమేమీ! అతఁ డిప్పుడు మన యుద్యానవనంబునం దున్నవాఁడా? అటులైన నాకింతవరకుఁ దెలుపని కారణంబేమి?

పద్మా—మనోహరా! నాకీసంగతి యీరోజుననే తెలిసినయది.

విక్రి—వాల్గంటీ! అతఁడెవండో నీకుఁ దెలియునా?

పద్మా—నాథా! అతం డయోధ్యాపురరాజగు జన్వంతుని ప్రథమపుత్రుఁడనియు, నతనినామము సుదర్శనుఁడనియు, తన పిన

తల్లివలన రాజ్యపరిచ్యుతుఁడై జననీసమేతముగా నిప్పుడొక మునివనవాటికయందు నివసించుచుండెననియు వినియుంటిని.

విక్ర—ఓహో! అయోధ్యాపుర పాలకుఁడగు జస్వంతసింహునిపుత్రుఁడా? ఆహా! ఏమిచిత్ర మేచిమిత్రము!

పద్మా—ప్రియా! ఆరాకొమరుఁడు సౌందర్యంబునఁ గంతువసంతులను, శౌర్యంబున శమనుని, విద్యావిశేషంబుల బుధునిఁ బోలువాఁడట.

విక్ర—ప్రేయసీ! నాకిపుడేమిచేయుటకును దోఁచకున్నయది. నాహృదయంబంతయు నంధకారపూరితంబై కన్పట్టుచున్నయది. మనపుత్రి నాజస్వంతసింహకుమారున కిచ్చి వివాహంబు సేయుదమన్న, స్వయంవరమునకై యేతెంచిన తక్కిన రాజపుత్రులవలన మనకుఁ గీడువాటిల్లునని నాకుఁ దోఁచుచున్నయది.

పద్మా—ప్రాణప్రియా! మీరెంతమాత్రమును జింతనొందకుఁడు. మన రాజపుత్రిని మునివేషధారియగు నా రాజకుమారున కిచ్చి రహస్యముగా వివాహంబొనరించి, యేరికి దెలియకుండులాగున వారి వెనువెంట కొంత సైన్యంబునిచ్చి, యర్ధరాత్రంబున రాకొమరుడున్న మునివాటికకు వీరిద్దరిం బంపివేసి, రాజపుత్రిక నెవరో చోరులెత్తుకొనిపోయిరనియు, నాబిడను దెచ్చిన వారికి తగిన బహుమతులొసంగి మన్ననఁ జేయుదుమనియుఁ జాటింతము. అటుపైన దైవమే కలఁడు.

విక్ర—కలికీ! కానిమ్ము. నీవనినటులనే చేయుదము. అటుపైన నేమయినను గానిమ్ము.

పద్మా—నాథా! వివాహముహూర్త నిర్ణయమునకై యొక బ్రాహ్మణునిఁ బిలిపింపుఁడు.

క్రి—(సేవకునిఁబిలిచి) ఓరీ! నీవిప్పుడే మన వెంకటశర్మఁ దోడ్కొనిరమ్ము.

భటు—చిత్తము. (నిష్క్రమించును)

(ప్రవేశము-వెంకటశర్మ)

వెంక—ఓహో! ఇంక నాకేమితక్కువ? నన్నురమ్మని రాజగారి యాజ్ఞయయినదట. నేనిప్పు డచటికే పోవుచున్నాను. నాకింకఁ జరీకండువాలేనా? పట్టంచు దోవతులేనా? బంగారుకడియము లేనా? పెండ్లంతయు నాపైనుండియే జరుగును. రాజుగారొసఁగు జరీకండువాలు, పట్టంచుదోవతులు, బంగారు నాణెములు, ధరించి, ఠీవిగా మీసములుసవరించి, నిక్కుచు, నీల్గుచు,సొక్కుచు, సోలుచు, తెక్కుచు, తారుచు, సానివీధినేగిన, నాపైఁ బడనివారెవరు? ఊఁ! అప్పుడు నా గయాళ్ళిపెండ్లాము నన్నే మనునో చూతము. (ప్రక్కకుఁజూచి) ఓహో! రాజ్ఞీసమేతుఁడై రాజుగారిచటనే యున్నవారు. నామాటలనేమైన వినలేదుగదా? (సమీపమున కేగి) రాజచంద్రా! నన్నుఁ బిలిచిరట. నావల్ల నేమైన పనియున్న యెడల సెలవిండు.

విక్రి—బ్రాహ్మణోత్తమా! వివాహంబునకు ముహూర్తం బెప్పుడో మంచిముహూర్తంబు నొకదానిని జూడుఁడు.

వెం—(వ్రేళ్ళులెక్కించుచు) రాజా! రేపురాత్రి యర్ధరాత్రింబునం దొక ముహూర్తము మంచిదిగా నున్నయది.

విక్రి—(పద్మావతి ముఖారవిందముఁ దిలకించి) కలికీ! రేపు అర్ధరాత్రింబున నొక ముహూర్తంబున్నదట. నీయభిప్రాయ మేమి?

పద్మా—సరే. మన కనుకూలముగానే యున్నయది.

విక్రి—(బ్రాహ్మణునిఁ విలకించి) విప్రవర్యా! రేపటిరోజున మన

మేరికిఁ దెలియకుండ మన యుద్యానవనంబునందున్న యొకరాజ పుత్రునకు మనపట్టి నిచ్చి వివాహంబు గావింపవలయును. ఇది రహస్యముసుమీ! ఏరికైనఁ దెలిపెదవేమొ, జాగ్రత్త!

వెం—చిత్తము. చిత్తము. నే నెవ్వరికిఁ దెలుపను.

విక్రి—సరే! రేపు వివాహముహూర్తమున కిచటికి రమ్ము.

వెం—చిత్తము. నేనింక సెలవు పుచ్చుకొనుచున్నవాఁడను. (నిష్క్రమించుచు తనలో) అబ్బా! బ్రతికిపోయినాను. ఇంతవరకు నాప్రాణము లరచేత నుండెడివి.

(నిష్క్రమించును.)

(ప్రవేశము—చంద్రికళ కమలహస్తముఁ బట్టుకొని)

చం—(హస్తము నెదజేర్చుకొని) అబ్బా! నీ వెంతటి మోసకత్తియవే! కమలా! నీ వింతటిదానవని నే నెరుగనుసుమీ! (కమలహస్తమును వక్షమునఁ జేర్చుకొని) ఇదిగో! ఇప్పటికిని నాహృదయ మేవిధిని టకటకలాడుచున్నయదో చూడుము. అబ్బబ్బా! నా మేనంతయు చెమ్మటచే తడిసిపోయెనుగదా!

కమ—(మందస్మితవదనారవిందయై) సఖీ! నిజముగా నాకేమియు దెలియదుసుమీ!

చం—అవునే! నీ కబద్ధములాడుట చిన్నప్పటినుండియు నలవాటే గదా!

కమ—అయ్యో! నీవు వట్టిబేలవు. నీకేమియుఁ దెలియదు. అతనిని నే నిదివరకును మునియనియే దలచుచుంటినిసుమీ!

చం—అవును. నీ వెన్నిబొంకినను నే నెంతమాత్రమును నమ్మదానను గాను. (నిట్టూర్పునిగుడ్చి) ఆహా! సఖీ! నేనేమని తెలుపుదును!

ఉ॥ పయ్యెదజారిపోయి కడు ♦ భావజుబారికి నన్నుఁ దేల్పగా
నెయ్యముతోడ సిగ్గునను ♦ నెంతయు లోంగగదీసె నిమ్ముగా
చయ్యన నాదు మేనపుడె ♦ చల్లనిచెమ్మటచేత నిండెను
న్నయ్యయొ నేమిసేయుదును♦ నాప్రియుఁ డెంతయు నన్నుఁజేరగ॥

మరియు,

సీ॥ చిన్ననౌ పల్కులఁ ♦ జేరి కల్కియన
నావీను లెంతో నా ♦ నందమొందె
చిన్నగా చేతులఁ ♦ జెంత జేర్పగ నన్ను
నా మేను నెంతో నా ♦ నందమొందె
చిన్నని చూపులఁ ♦ చిన్నగ జూడగ
నా సారు నెంతో నా ♦ నందమొందె
చిన్నగ నా చెంతఁ ♦ జేరగ నాతఁడు
నాదు సంగకము లా ♦ నందమొందె
గీ॥ నన్ను ముద్దిడబోవగ ♦ నాదు మనము
భయముతోడుత నెంతయు ♦ వడఁకసాగె
అంగములు పొంగిపోయె నా ♦ యానమయ్యె
నేమి తెల్పుదు నేనింక ♦ నిక్కముగను॥

కమ—(ఎదుటఁ దిలకించి) అమ్మా! కళా! మాతలిదండ్రులగు పద్మావతీవిక్రమకేతు లిచ్చటనే యున్నవారు. చూచితివా?

చం—ఓహో! మన మనుకొనుమాటలను వినలేదుగదా!

కమ—ఓసి పిచ్చితల్లీ! మనమాటల వినలేదులే. రమ్ము పోవుదము.
(చంద్రకళకమలలు పద్మావతీవిక్రమకేతులచెంత కేగుదురు.)

చం—(తలిదండ్రులకు నమస్కరించును.)

విక్ర—కళా! నీ వెంతసేపయిన దిచ్చటికి వచ్చి? మేము మాటలాడు చుండుటవలన నిన్నుఁ గనుఁగొనలేదు.

చం—తండ్రీ! నే నిచటి కిప్పుడె వచ్చితిని.

పద్మా—కుమారీ! మంచిసమయమునకే నీ విటకే తెంచితివి. రా రమ్మ (చెంతకుఁ దీసికొని ముద్దిడుకొనును.)

విక్రి—కమలా! నీసఖి వరించిన రాకొమరునకే యిచ్చి వివాహంబు సేయ రేపే ముహూర్తమును నిశ్చయించినారము. నీకు సంతో షమేనా?

కమ—మా చెలికి సంతసమయినయెడల నాకును సంతసమే. (చంద్రి కళను జూచి) చెలీ! మీనాయనగా రనినమాటలను వింటివా?

చం—(సిగ్గుచేఁ దల వంచుకొనును.)

పద్మా—(మందస్మితవదనారవిందయై) నాచిట్టితల్లికి వివాహమనగానే సిగ్గావరించినయది.

చం—ఏమే! కమలా! నీసంగతి యమ్మగారికి వెల్లడించవలయునా?

కమ—(కన్నుగీటి వద్దని నివారించును.)

చం—(చిఱునవ్వుతో) నీవు వద్దని చెప్పినంతనే నేనూరకుందునా?

పద్మా—అమ్మా! కమలా! ఏమి టాసంగతి?

కమ—(చంద్రికళను వారించుచు) ఏమియు లేదమ్మా! మనకళ వట్టి పిచ్చిది.

చం—ఆహా! నీ వెంతటిజాణవే! నీవు చెప్పవద్దన్నను నేను చెప్ప. దనులే.

పద్మా—అదేదో నాకుఁ దెల్పుదురూ! మీ రెందుకుఁ దగవులా డెదరు?

చం—(కమలను జూచుచు) మరేమియు లేదమ్మా! పురంజయుని నీకమల వరించినది.

పద్మా—(నవ్వుచు) ఓహో! అయిన సంతోషమే! మీరిద్దరు నొకచో జతఁగూడి యుందురు.

విక్రమ—అమ్మా! కళా! పొద్దుపోయినది. పోవుదము రండు.

(విక్రమకేతుఁడు, పద్మావతి నిష్క్రమింతురు.)

కమ—(చంద్రకళతో తలయూచుచు) కానీ! కానీ! నాగుట్టంతయు బయటబెట్టితివిగాదా?

చం—(నవ్వుచు) అదిగో! రా రమ్మ. తండ్రిగారు పిలుచుచున్నారు.

(అందరు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము



శ్రీరస్తు

# చంద్రకళాస్వయంవరము

## పంచమాంకము



రంగము—కాశీపురమున నొకశిబిరము.

(మగధేశ్వరుఁడగు నయనపాలుఁడును, సురేంద్రుఁడును, మంత్రులగు దుర్మద, దుష్టసేనులును)

నయ—(తనమంత్రియగు దుర్మదుఁజూచి) మంత్రిశేఖరా! మనభటుల సంపి పురవిశేషములఁ గనుఁగొంటివా?

దుర్మ—చిత్తము. కనుఁగొంటిని.

నయ—విశేషములేమి?

దుర్మ—మరేమియు లేవు. విక్రమకేతునికూతురగు చంద్రకళ స్వప్నమం దొకపురుషునిఁ గాంచి వానినిఁదప్ప వేరువానిని నేను వివాహంబాడననియు, వేరువారికి తననొసంగిన ప్రాణత్యాగముఁ జేసికొని మరణించెదననియు బ్రతిజ్ఞఁ బూనినదట.

సురే—ఏమీ! ఆస్త్రీ యింకొకరిని వరించినదా! కట్టా!

నయ—(సురేంద్రునిపయిఁ జేయివేసి) తండ్రీ! తొందరపడకుము.

చ॥ నలుగకుమయ్య యీవిధికి ♦ నాయెడ బ్రాణములుండ నీవిటుల్
ఇలపయి నీకుఁ దప్పగను ♦ నేరికిఁజెందదు జూడుమింక యా

జలరుహనేత్రి నెట్లయిన ♦ జక్కఁగ నీ కొనగూర్చువాఁడ నీ
యిలపయినున్న రాజులిక ♦ యేకత తోఁడుగ బోరవచ్చినన్॥

వత్సా! నీవింక భయంబుడుగుము. ఆకాంత నీకుఁదప్ప వే
రొకని కాకమలగర్భు డడ్డపడినను గానేరదు.

సురే—అమాత్యపుంగవా! దుర్మదా! ఆస్త్రీ వరించిన పురుషుఁడెవఁడో
నీకుఁ దెలియునా?

దుర్మ—అయోధ్యాపతీ! సురేంద్రసింహా! అతనియుదంతంబంతయు
నాకు దెలియదుగాని కొంతవరకు చారులనంపి కనుఁగొంటిని.

నయ—అయిన నాతఁడెవఁడో నాకు సవిస్తరంబుగాఁ దెల్పఁగలవా?

దుర్మ—చిత్తము. అతఁడు మనపురసమీపమున నున్న యొక ముని
వాటికయం దుండునట. ఆతనిజాడ నరయుటకై నొకకొత్త
చారుని నంపితిని. ఆతఁ డింతవరకును రాలేదు.

సురే—సుశీలాసుదర్శనుల సంగతి నీకేమయినఁ దెలియునా?

దుర్మ—వారిసంగతియంతయు మన దుష్టసేనునికి బాగుగా తెలియును.

దుష్ట—(సురేంద్రునిఁజూచి) మహాప్రభూ! నే నంతయుఁ జారులవలన
గనుఁగొంటిని. వారిప్పుడు మన యయోధ్యాపురంబునకు
దక్షిణముననున్న నొకమునివాటిక నున్నవారట.

నయ—ఏమేమీ! వారు మనపురసమీపముననే యున్నవారా! ఓరా!
ఏమిచిత్రము! ఈవిక్రమకేతునిపుత్రి వరించిన పురుషుఁ డీ సుద
ర్శనుండు కాఁడుగదా!

దుష్ట—అవును. నాకదే యనుమానము.

నయ—అయిన మనచారుల నంపి వారియుదంతమంతయు గనుఁగొనెద
ము. (దుర్మదుఁజూచి) మంత్రీశ్వరా! దుర్మదా! రేపే వారియు
దంతంబుఁ గనుఁగొన నొకచారుని నంపుము.

దుష్ట—చిత్తము.

(ప్రవేశము - పురంజయుడు మారువేషముతో)

పురం—నన్ను వీరింకను గుర్తించలేదు. వీరి రహస్యములన్నియుఁ గను గొనుటకై కొద్దిరోజులనుండి వీరియొద్ద మారువేషముతో నుంటిని. వీరి సంగతులన్నియు నాకుఁ దెలిసిపోయినవి. వీరు సుశీలాసుదర్శనులుండుజాడ చారులవలనఁ దెలిసికొనిరట. సుదర్శనుఁడుమాత్రి మిచ్చుటనేయున్నవాఁడు. సుశీలాదేవిఁ గాపాడుటకై యొకభటుని నంపి కొందరి భిల్లభటులఁ గావుండు నటుల జేయించెదను. చంద్రికళను సురేంద్రునికి తప్పక వివాహంబు గావింతునని నయనపాలుఁడు ప్రతిజ్ఞ బూనినటుల నాకు భటునివలనఁ దెలియవచ్చినది. కమలవలన నాకు చంద్రికళను సుదర్శనునికిచ్చి నేటిరాత్రి వివాహంబు గావింతురని తెలియవచ్చినది. ఇదియంతయుఁజూడ నేదో యొక కోలాహలం బుదయించునట్లు తోచుచున్నయది. ఈసంగతియంతయు మా చంద్రశర్మ కెరింగించి తగినప్రయత్నంబు లాతనిచే జేయింపఁ జేయుదును. (నయనపాలునిదగ్గర కేగి వందనమాచరించి నిలువం బడును.)

దుర్మ—ఓయీ! వీరసేనా! నీ వతి చాకచక్యుండవు. నిన్నుఁగాంచిన నాకు సంతసం బుదయించును. నీవంటిభటుడు మాకుండ మా కేమికొదువ! మాభటులతో నీవంటి ధీరుఁడును రణవీరుఁడును నగువాఁడు నీవుదక్క మరొక్కఁడు లేడుసుమీ!

పురం—స్వామీ! ఇదియంతయుఁ దమ యుదారస్వభావంబేగాని నా యెడల తెలివేమియు లేదు.

దుర్మ—నీ వాపురుషునియుదంతం బేమయినఁ గనుగొంటివా?

పురం—చిత్తము. కనుఁగొంటిని.

దుర్మ—అతఁ డొక మునికుమారుఁడని వినియుంటిని. ఈమాట నిజ మేనా?

పురం——అమాత్యపుంగవా! ఇటు వినుడు.

ఉ॥ వానివిలాసవైఖరులు ♦ వానిముఖంబున నున్నచిన్నెలు
న్వానివిశాలవక్షమును ♦ వానికిఁగల్గిన యంగసౌంకము
న్వానిదయామయత్వమును ♦ వానికిఁగల్గిన వాక్చమత్కృతి
న్గానగ రాజపుత్రుఁడని ♦ గట్టిగఁదోఁచెను నాకు నెంతయున్॥

నయ——మంత్రిశేఖరా! ఈతఁడు చెప్పినవిషయంబులఁజూడ నతఁడు తప్పక మన సుదర్శనుఁడనియే తెలియవచ్చినయది.

దుర్మ——నాకును నట్లే తోఁచుచున్నయది.

సురేం——పితామహా! నయనపాలా! వారే సుశీలాసుదర్శనులైనయెడల వారినిఁబట్టుటకై మనభటుల నంపిన బాగుగానుండునని తోఁచుచున్నయది.

నయ——అవును. నే నదే యోచించుచుంటిని.

పురం—మగధేశ్వరా! నయనపాలమహారాజా! నేను ప్రయాణుఁడనై తిరిగి యిచ్చటికి వచ్చురోజుననే వారెటకో ప్రయాణులవుచుండిరి.

దుర్మ——వారెటకేగుచుండిరో నీకుఁ దెలియునా?

పురం——నేనప్పుడే రహస్యముగా నొక భటునివలన నంతయుఁ గనుఁగొంటిని.

దుర్మ——ఏమని కనుఁగొంటివి?

పురం——వారిటకే ప్రయాణులై వచ్చుచున్నట్లు కనుఁగొంటిని.

నయ——ఓహో! చంద్రికళను వివాహంబాడ బయలుదేరినట్లు నాకు దోఁచుచున్నయది. (మంత్రిఁజూచి) వారిటకే ప్రయాణులయి నటుల నీతఁడు నుడువుచున్నాడు. కావున మన భటుల రహస్యముగా నీపురంబుననుంచి వారినిఁ బట్టుకొనుటకై యాజ్ఞాపింతము. ఈపనికై యీ వీరసేననే పంపుదము.

దుర్మ—ఓయీ! వీరసేనా! నీచతురతకు మాభూపాలుఁడుగూఁడా మెచ్చుకొనియెను. నీవెట్టిపనినయినను త్వరలో గావించు వాఁడవు. కావున నీవు కొందఱిభటుల వెంటనిడుకొని సుశీలా సుదర్శనులఁ గనుఁగొని వారిని మాకప్పజెప్పిన నీకుఁదగిన బహుమతి నిప్పించెదము.

పురం—చిత్తము. మీయాజ్ఞ శిరసావహించితిని.

దుర్మ—అయిన నీవిఁక సెలవు దీసికొనుము.

నయ—చూడుసుమీ! నీ వతిజాగ్రత్తగా వారిని వెతకవలయును.

వీర—చిత్తము. (ఈవలకు వచ్చి) వీరికి సుశీలాసుదర్శనులఁ బట్టియివ్వ వలెనట! వీరిసంగతి యంతయు నాకుఁ దెలిసిపోయినది. ఈసం గతి యంతయు మాచంద్రశర్మ కెఱింగించెదను.

(నిష్క్రమించును.)

నయ—అమాత్యపుంగవా! వీనిఁజూడ నతిచాకచక్యుడుగా నాకుఁ దోచుచున్నవాఁడు. వీని సంగతి మనకింకను క్రొత్తగానే యున్నయది. కావున నీపనికై యింకొకనింగూడ నియ మించిన బాగుగా నుండునని నాయభిప్రాయము.

దుర్మ—మహాప్రభూ! వీఁడట్టివాఁడు కాడని నాయభిప్రాయమైనను నే నీపనికై యింకొకనిఁగూడ నియమింపవలయునని యను కొంటిని.

నయ—(సురేంద్రుఁజూచి) నాయనా! ప్రొద్దుపోయినది. రమ్ము. పోవు దము. (అందరు నిష్క్రమింతురు.)

(భటుఁడొకఁడు ప్రవేశించి)

భటు—ఈసంగతి యంతయుఁ దిరిగి మాపురంజయున కెఱింగించెదను.

(నిష్క్రమించును.)

## ద్వితీయరంగము - ఉద్యానవనము.

(ప్రవేశము - వెండ్రుకలు వీడిపోయి వక్షస్థలమందు వ్యాపింప సుదర్శనుండు.)

సుద—హా! నాప్రియసఖి! కళా! కళా! నీ వెచ్చటికేగితివి? (ప్రక్కకుజూచి) అదిగో! నామనోహారిణి సంపెంగపొదమాటునఁ డాగి నన్నుఁజేర బిలుచుచున్నయది. (చేతులజాపి) హా! కలికీ! చంద్రకళా! చంద్రకళా! నాపై కోపమా? (పకపక నవ్వుచు) అయ్యో! నీవు వట్టి పిచ్చిదానవుగదా! రా రమ్ము. ననుఁ గౌగలించుకొనియెదవుగాని. (చెంతకేగి) అయ్యో! నాప్రేయసీ! నీ వెచటికేగితివి? హా! చంద్రకళాదులారా! నాప్రియసఖ నెచ్చట నుంచితిరి?—అహా! ఏమది? కోకిలకంఠమువలె నీనాదము కూ! యని వినవచ్చుచున్నయది. నా మరాళమందయాన, నాయిందిందిరాపాంగ, నారతనాలరాశి, నన్నుం బిలుచుటలేదుగదా! కట్టా! నాహృదయంబంతయు జాజ్వల్యమానంబై మండిపోవు చున్నయది. నేనేమిసేయువాఁడను?

సీ॥ కలకంఠకంఠి నా ♦ కాంత నా కొసఁగరే
కలకంఠవర నీల ♦ కంఠులార
కులుకుల చిల్కల ♦ కొల్కి నా కొసఁగరే
చిన్నని నాముద్దు ♦ చిల్కలార
హంసీగమనను నా ♦ యండ జేర్పగరారె
హంసలారా! ముద్దు ♦ హంసలార
కాంచనగాత్రి నా ♦ కల్కి నాకివ్వరే
కాంచనలతలార ♦ కరుణతోడ
గీ॥ వేగ నాముద్దుసఖి నింక ♦ వేడ్కతోడ
నాదు కౌఁగిలిఁ జేర్చి యా ♦ నందముగను
బ్రొద్దుబుచ్చగనిండు నా ♦ పొలతితోడ

వేపఁకుండిక మిమ్ములే • వేడుకొందు
నాదురమణిని నాకిందు • రయముతోడ॥

హా! దైవమా! నామేనంతయు గాలితాకుడుచే నడలువృక్షశాఖలరీతి గడగడ లాడిపోవుచుండెనుగదా! కట్టా! నాకన్నులు దిరుగుచున్నయవి. నాహృదయంబంతయు నంధకారపూరితంబై జలంబునఁబడ్డ యీాగవలెనున్నయది. (మేను దడుము కొనుచు) ఆహా! నావస్త్రంబులన్నియు దడిసిపోయినవి.

చ॥ హృదయమునందు నాపొలఁతి • యీారక వేపగ చిన్నినడ్కల
న్నదయతనొప్పు చూపులను • జక్కగ నాహృదయంబు ప్రేమతో
నెద వసియింపఁజేసికొని • యెంతయుఁబోయెను నన్ను వేప హా!
మదనుఁడు మాడ్చుచుండె నను • మూడగజాలను బాణపంక్తులన్॥

(అటునిటుఁజూచి) ఆహా! ఏమిది? ఎవ్వరో వచ్చుచున్నట్లు పద ధ్వని వినవచ్చుచున్నయది. నామనోహారిణి యగు చంద్రికళ కాదుగదా!

శా॥ రమ్మా వేగమె నాదుసుందరి యికన్ • రమ్యంబుగా ప్రేమచే
నిమ్మారైనను కౌఁగిలింపగదవే • యింపొందగా నెంతయో
కొమ్మా తీర్పుము చింతలన్నియును నా • కోర్కుల్ ఫలంబొందగఁ
రమ్మా జేరగదీయ నన్నికను నా • రామామణీ ముద్దుగన్॥

వాల్గంటీ! రా రమ్ము. భవద్వియోగానలకీలలంబడి మాడిపోవుచున్న నన్ను జలోపరిభాగంబులనున్న కుముదంబులపై సుధాకరుఁడు మధురసుధారసం బొలికించు చందంబున నాకు నీసుందరవదనారవిందసందర్శనంబుఁ గావించి, న న్నానంద తుందిలుఁ జేయుమా!

(కమల ప్రవేశించి)

కమ—(తనలో) ఏమిది! ఇత డీవిధంబున నున్నవాఁడు. ఇతనిఁ బలుకరించి చూచెదఁగాక! (ప్రకాశముగా) మునికులతిలకా! ఏల నీ వీ విధిని వాపోవుచుంటివి?

సుద—(కమలవైపు చేతులజాచి) కలికీ! చంద్రికళా! చంద్రికళా! ఇంకను నన్ను మునికులతిలకా యని పరిహసించెదవా? రా రమ్ము. నన్ను వేగఁ గౌఁగిలిఁజేర్చి యానందపరుపుము.

కమ—మునివరేణ్యా! నేను కమలను. చంద్రికళను గాను.

సుద—అయ్యో! మనోహారిణీ నీవు నన్నింకను మోసపుచ్చుచుంటివా? కాదు. కాదు. నీవు కమలవుగావు, చంద్రికళవే!

కమ—సుదర్శనా! ఏల నివిట్లూరకే బేలవై వాపోయెదవు? ఊరడిల్లు మూరడిల్లుము. నేను కమలనే. నీవు వట్టిగా భ్రమించుచుంటివి.

సుద—ఏమీ! నీవు చంద్రికళవు గావా? కమలవా?

కమ—అవును, నేను కమలనే. నీకొక శుభవార్తఁ దెలుపుటకై వచ్చితిని.

సుద—శుభవార్తయా? ఏ మా శుభవార్త? నాకలికి యిటకు వచ్చుచున్నదా? చెప్పు చెప్పు.

కమ—లేదు. లేదు. నీకలికి వచ్చుటలేదు.

సుద—కటా! నారమణిఁజూడక నే నెట్లు జీవింతును!

కమ—సుదర్శనా! నామాటలపూర్తిగా వినకయే నీవూరకే వాపోయెదవేల?

సుద—కమలా! నన్నూరకే వేపెదవేల? నాచంద్రికళఁ జూడనిదే నామనంబు చల్లఁబడదు.

కమ—నీచంద్రికళను నీకుఁ దప్పక నేటిరాత్రి వివాహంబు గావింతుగాని నీ వింక విచారం బుడుగుము.

సుద—హా! ఏమిది! కమలా! కమలా! నిజముగా నాసుందరిని నాకిచ్చి వివాహంబు జేతురా! ఏమో! నే నమ్మజాలను.

కమ—రాజకుమారా! నేనుజెప్పుమాటల నీవు నమ్మకున్న నే నేమిసే యుదును? నీతో నేను బూటకము లాడుదాననా?

సుద—అబ్బా! నీవెంతటి మాయలాడివి! నిజముగా నీమాటల నేను నమ్మువాడనా?

కమ—నమ్మకుండిన నే నేమిసేయుదును? (ఎదురఁజూచి) అదుగో! పురంజయుఁ డిటకే వచ్చుచున్నవాఁడు. అతనినైన నీసంగతి విచారించి నేను నుడివినమాట నిజమో యబద్ధమో కనుఁగొనుము.

(ప్రవేశము - పురంజయుఁడు.)

పుర—(ఎదురఁజూచి) అదుగో! మాసుదర్శనుఁడును, మన్మనోహారిణి యగు కమలయును, నాకొరకై నిరీక్షించుచున్నవారు. పోయి కనుఁగొనదఁగాక. (సుదర్శనుఁజేరి) మిత్రమా! నిన్నుఁజూచి చాలరోజులయినది. విశేషములేమి? (కమలఁజూచి నవ్వుచు) ఓహో! కమలగూడ నిచటనే యున్నదా!

కమ—(చిఱునవ్వు నవ్వుచు) నేను నీ కిప్పుడే కన్పడితినా!

పురం—(కమలనుజూచి నవ్వుచు) కములా! మాసుదర్శనుని నెందులకు మోసపుచ్చుచుంటివి?

కమ—పురంజయా! మాచంద్రికను నేటిరాత్రి యీతనికిచ్చి వివాహంబు గావించుటకు నిశ్చయింపలేదా?

సుద—మిత్రమా! ఈకమలనుడివినమాట సత్యమేనా?

పురం—మిత్రమా! సుదర్శనా! ఈకమల నుడువుమాట లసత్యములు

గావు. నేటిరాత్రి రహస్యముగా చంద్రికళను నీకిచ్చి వివాహ
ము సేతురని వినియుంటిని.

సుద—ఏమీ! కమలనుడివినమాట నిజమేనా? నేడెంత సుదినమో
కదా! (పురంజయునిఁజూచి) మిత్రమా!

గీ॥ సుందరపుమూర్తి యందంపు ♦ సొగసులాడి
కమలదళనేత్రి చిన్నారి ♦ కలికిమిన్న
హరువులకుదొంతి నాయింతి ♦ నతిముదమున
నేనుజేకొన నాకింక ♦ నేమికొదువ॥

ఉ॥ చిల్కలకొల్కి నాయతివ ♦ జేరగవచ్చిన జింతలన్ని హా
జుల్కనఁ బారిపోవ్నగద ♦ సుందరిమోమునుజూడ మారుఁడే
యల్కను మోమువంచుకొని ♦ తద్దయు సిగ్గునఁ బారిపోవుఁగా
కల్కిని నొయ్యఁజేకొనఁగ ♦ గాదె దలంపఁగ నాదె భాగ్యముల్॥
మరియు,

సీ॥ కల్కి రతనము నా ♦ కాంతనుగైకొన
నాదిగా భాగ్యంబు ♦ దలపమదిని
బంగారుబంతి యా ♦ భామనుజేకొన
నాదిగా భాగ్యంబు ♦ దలఁపమదిని
అందమ్ముపంట యా ♦ యతివనుజేకొన
నాదిగా భాగ్యంబు ♦ దలఁపమదిని
కలకంఠకంఠి యా ♦ కాంతనుజేకొన
నాదిగా భాగ్యంబుఁ ♦ దలపమదిని
గీ॥ సుందరపుమూర్తి యందంపు ♦ సొగసులాడి
కమలదళనేత్రి చిన్నారి ♦ కలికిమిన్న
యందములదొంతి నాయింతి ♦ యందముగను
జేరిసుఖయింప నేనింక ♦ జెప్పగలనె
పుడమియందున నేనెగా ♦ భోగినింక॥

ఆహా! పుట్టిననాటనుండియు నే నిట్టి కర్ణానందంబైన మాటల నెన్నఁడును వినలేదుగదా? నే నారమణిఁ జేకొనిన నాజన్మంబు సార్థకంబయ్యెను. మదనజ్వాలానలకీలలఁబడి మాడిపోయిన నీహృదయంబున చిన్నచిన్నగ నాశాంకురంబులు మొలచుచుం డెను.

(ప్రవేశము: భటుఁడొకఁడు)

భటు—(సుదర్శనునికి వందనమొనర్చి) స్వామీ! మిమ్ములఁ జూచు టకై ప్రభువుగా రిచ్చటికి వచ్చుచున్నవారు.

పురం—మిత్రమా! రాజుగారు నిన్నుఁ జూచుటకు వచ్చుచుండిరట. (ఎదురజూచి) అదిగో! రాజుగారు వచ్చుచున్నారు.

(ప్రవేశము విక్రమకేతుఁడు.)

విక్ర—(సుదర్శనుఁ జూచి) ఆహా! ఇతఁడేకాబోలు నాకుఁ గాబోవు నల్లుఁడు. ఆహా! ఏమి వీనిసౌందర్యము!

చ॥ జలరుహనేత్రలందెగడు ♦ జంచలనేత్రుఁడు వీనిజూడగా
జలరుహనేత్రలెంతయును ♦ జంచలతం గనుదుర్ గదా మదిం
జలరుహనేత్రపుత్రకుని ♦ జక్కనిబాణములందుఁ జిక్కువా
రిలపయి వీనిఁ బోలగను ♦ నేరినిఁ జూడగలేదు నేనహా!

నిజముగా నీతనిఁజూచిన నేకాంత వల్వదు? వీని యాకార లక్షణంబులఁ జూడ జక్రవర్తిలక్షణంబులవలెఁ గాన్పించు చున్నయవి. అన్నన్నా! ఇతని బాహువు లతిపొంకములై వక్ష స్థల మతివిశాలమై, ఎంతసుందరమై కాన్పించుచున్నయవి. సుక్షత్రియుండును, సుందరాకారుఁడును నగు నీతినిని నేనల్లు నిఁగా జేర్చుకొన, తప్పక పావనుండయ్యెదను. (సుదర్శనుని చెంతకేతెంచి) మునిచంద్రమా!

గీ॥ పావనతగంటి నేనింక ♦ పరమపురుష
యతిథివైతివి మాకింక ♦ రమ్యముగను

మేముచేసెడిపూజల ♦ మీరుగొనిన
నాదుజన్మంబు సఫలతన్ ♦ గనునుగాదె!

ఓ మునివరేణ్యా! మీవంటివారు మాయింటికేతెంచిన మాకిం కేమి కొదువ? మీరు నాయందు కృపార్ద్రచిత్తులై నే నొసఁగు సదుపచారంబులఁ గైకొని మమ్ముఁ బావనులఁ గావింప వేడు చుంటిని.

పురం—రాజవరేణ్యా! మీరలిచ్చు నాతిథ్యంబును మాగురువుగారు తప్పక పుచ్చుకొనియెదరు.

విక్రి—(సుదర్శనుజూచి) మునికులతిలకా! మనమింక పోవుదము రండు. (కమలఁజూచి) కమలా! నీవిచ్చటనే యుంటివా? రమ్ము పోవుదము. (విక్రమసుదర్శనులు నిష్క్రమింతురు).

కమ—పురంజయా! నేను పోవుచుంటిని. (పోబోవును)

పురం—(కమల కడ్డముగా నిలువఁబడి) కమలా! పోవుచుంటివా? పోకు పో కొకమాట! (అడ్డముగా నిలువఁబడును.)

కమ—(మందస్మితవదనారవిందయై) ఏమిది! పురంజయా! నీకేమి పిచ్చిపట్టినదా! నాకింటియందు కావలసినన్ని పనులున్నవి. నన్ని ట్లడ్డగించిన నెట్లు?

పురం—కమలా నాపై కోపమా?

కమ—నాకు కోపములేదు తాపములేదు.

పురం—అయిన నొకమాట! (నిట్టూర్పునిగుడ్చి) నీవు నన్నుఁ బ్రేమిం చితివా?

కమ—ఓహో! నన్నిందుకేనా యాపినది. బాగుగానే యున్న యది. (పోబోవును)

పురం—(కమలహస్తంబును బట్టుకొని) కమలా! కమలా! పోకుము.

కమ—ఓహో! నీకు స్త్రీపురుష వివక్షతలు తెలియనట్టుగా నున్నయది. పరస్త్రీనిఁబట్టిన నీకుఁ బాపముసుమీ!

పురం—కమలా! నీ వింకను అవివాహితవుగదా! నిన్నుముట్టిన నేమి దోషము?

కమ—ఓహో! నీవిందులకేనా నన్నాపుచున్నయది? నే నెప్పుడొక్కని వరించి యాతనిబెండ్లియాడఁబూనుకొంటినో అప్పుడే పరస్త్రీ నైతిని.

పురం—ఆహా! కమలా! నిజముగా నీవు వరించిన పురుషు డెంతధన్యుఁడోగదా! అతని నామంబు నాకుఁదెలిపి న న్నానందపరుపుమా!

కమ—అతని నామముతో నీకేమిపని? పో పొమ్ము. (అటునిటుఁజూచి) అదుగో! ఎవరో వచ్చుచున్నట్టున్న దటుఁ జూడుము.

పురం—(చేయివిడిచి తిరిగిచూచును.)

కమ—(తనలో) నే నీతనిచే దప్పించుకొను టిదే సమయము.

(తెలియకుండ నిష్క్రమించును)

పురం—(వెనుకకుఁ దిరుగకయే) కమలా! ఎవ్వరును లేరే! నన్ను మోసపుచ్చుచుంటివా? (తిరిగిచూచి) అబ్బా! ఇక్కమల ఎంతటి మాయలాడి! నన్నుఁ దప్పించుకొని పారిపోయెనుగదా! దీనిని వివాహమాడకపోయిన నేనే పురంజయుఁడను గాను.

(తలనూపుచు నిష్క్రమించును)

(ప్రవేశము—కొందరు భిల్లులును భిల్లనాయకుఁడును)

నాయ—(భిల్లులఁజూచి) ఒరే! మనసుదర్శనమహారాజు మంతో సెప్పకుండా ఒక్కడే వెళ్లేపాడా?!

ఒక—ఏడ్కెల్లాడు బాబూ?

రెండ—కాసీపట్నానికిరా!

ఒక—కాసీపట్నంతో ఏంపనుందిరా?

రెండ—కాసీపట్నం రాజుగారి కుమార్తె పెండ్లుందంట. ఆపెండ్లికెల్లాడని వారిఅమ్మోరు సుచీలదేవిగారు మననాయకునితో చెప్పిందటారి!

నాయ—(అటునిటుఁజూచి) ఓరే! ఇక్కడికెవ్వరో వస్తూన్నారా!

(ప్రవేశము—చంద్రశర్మ)

చంద్ర—ఆహా! ఇక్కరాతకులు మాసుదర్శనునిప్రియమిత్రులు. వీరికి సుదర్శనుని యాపద నెరింగించి సహాయమునకై ప్రోత్సహించెదఁగాక. అటుపైన దైవమే కలఁడు. శత్రురాజగు నయనపాలుం డతిదుర్మార్గుఁడును, బలశాలియు నగువాఁడు. ఇతనిఁదాకి బోరు టతిదుస్తరముగా దోచుచున్నయది. హా! దైవమా

గీ॥ రాజ్యమందున సుఖయించు ♦ రాజపుత్రు
నడవిపాల్సేసి నీవిట్లు ♦ దయనుమాలి
కష్టముల పాలుజేయగఁ ♦ గడపినావు
నిటుల బాధలఁ బెట్టఁగ ♦ నీకెతగును॥

(పైకిఁజూచి) భాస్కరుఁ డస్తాద్రిఁ జేరుచున్నవాఁడు. వీరిప్పుడు వారణాసీపురంబునకుఁ బ్రయాణులైన రేపుదయమునఁ జేరుదురు. కావున వీరికిప్పుఁ డీసంగతి యంతయు దెలిపి ప్రయాణులౌటకుఁ బ్రోత్సహించెదను గాక! (భిల్లుల చెంతకేగి నాయకుఁజూచి) ఓయీ! నాయకా! నేను మీసుదర్శనుని ప్రియమిత్రుఁడను. ఆతఁ డిప్పుడు వారణాసీపురంబున నున్నవాఁడు.

నాయ—(చేతుల జోడించుకొని) మహాప్రభూ! మాసుదర్శన మారాజుగారు క్షేమముగా నున్నవారా?

చంద్ర—క్షేమముగా నున్నవారు. అతని శత్రువులగు నయనపాల సురేంద్రులాతనిఁ జంపఁ బ్రయత్నించుచున్నవారు. మీరిప్పు

డాకాశీపురంబునకు వెడలిపోయి సుదర్శనుఁ గాపాడిన మీ సుదర్శనుఁడు మీకుఁ దక్కును.

నాయ—ఓహో! ఐన మే మిప్పుడేవెళ్ళి మాప్రభువుగారిని రక్షించు కుంటాము. (భిల్లులఁజూచి) ఒరే! మీరందరు మన ప్రభువు గారిని రక్షించడానికి కాశీకి రావలెను.

అందఱు—చిత్తం. చిత్తం.

చంద్రి—ఓరే! నేనుకూడా మీ వెంబడే వచ్చెదను. రండు పోవుదము.

నాయ—చిత్తం బాబూ!

(అందరు నిష్క్రమింతురు.)

## తృతీయరంగము - రాజగృహము.

(ప్రవేశము. రాజు విక్రమకేతుఁడును, రాణి పద్మావతియు, చంద్రికళా సుదర్శనులును, కమలా పురంజయులును.)

పద్మా—(చేతనున్న పుష్పమాలను చంద్రికళ చేతికిచ్చి) పుత్రీ! ఇప్పుష్పహారంబును నీమనోహరుని మెడయందు వేయుము.

చంద్రి—(పుష్పహారంబును సుదర్శనుని కంఠమందు వేయును.)

పురం—(చేతనున్న పుష్పమాలను సుదర్శనుని చేతికిచ్చి) మిత్రమా! ఇప్పుష్పహారంబును నీమనోహారిణియగు చంద్రికళకంఠమం దుంచుము.

సుద—(పుష్పహారంబును చంద్రికళ కంఠమందు వేయును.)

విక్రి—(చంద్రికళ హస్తమును, సుదర్శనుని హస్తమందుంచి) నాయనా! సుదర్శనా!

సీ॥ కన్నవారము మేము ♦ కరము నోములునోచి
ప్రేమతో నీచిన్ని ♦ బిడ్డనయ్య!
పెంచినారము గదా ♦ పెద్దయాస మెసంగ
నడచిన మన్నంటు ♦ ననుచునయ్య!
వినలేదుగద మేము ♦ వీణానినాదంబు
మాయమ్మ చిన్నగఁ ♦ బలుకనయ్య!
మఱచినారము గదా! ♦ మాచింత లన్నియు
మాతల్లి నిన్గూడ ♦ మమతనయ్య!
గీ॥ పుష్పములఁ గోసినను నహా! ♦ పుత్రికెంతో
హస్తమును కందు నీకయో ♦ ననుచు మేము
జేరనివ్వఁగ బోముగా ♦ చెలియు నెపుడు
నిట్టిబిడ్డను నీచేతి ♦ కిచ్చినాము॥

మఱియు,

గీ॥ ఏకపుత్రిని ప్రేమతో ♦ నిచ్చినాము
పాలముంచెదొ? నీవింక ♦ బరగ నీట
ముంచెదో? నీకె యిడితిమి ♦ ముద్దుగాను
నేలికొమ్మక నాపుత్రి ♦ నెనరుమీర॥

జామాతా!

సీ॥ చిన్నఁగ మాచిన్ని ♦ చిన్నారి సుతచేయి
పుష్పము ల్గోయఁగ ♦ పొక్కులెత్తు
మాయమ్మ చిన్నగ ♦ మంచము దిగినను
చెక్కిళ్ళను జెమట ♦ జేరునెంతొ
యీచిన్ని సుకుమారి ♦ యేయగ నడుగును
కాళ్లను బొబ్బలు ♦ కానుపట్టు
వీణ చేతను బట్టి ♦ వేడ్కగా పాడిన
నలసటనందు మా ♦ యలరుబోడి
గీ॥ ఇట్టి సుకుమారగాత్రిని ♦ నింపుతోడ
నీకు నిచ్చితి ప్రేమతో ♦ నెట్టులింక

నేలుకోనిమెదో? బిడ్డను ♦ నెయ్యముగను
రమ్యగుణసాంద్రి! జన్వంత ♦ రాజపుత్రి॥

పుత్రీ! చంద్రికా!

సీ॥ పతియె దైవమటంచు ♦ భావించు తల్లిరో!
భావమం దెప్పుడు ♦ పరఁగు ప్రీతి
పతియేమి యన్నను ♦ భక్తితో నాతని
కోపగించక యూర ♦ కుండుమమ్మ!
పతిమాట జవదాట ♦ భావ్యంబు గాదంచు
మది నెప్పుడు ♦ నెరుగుమమ్మ
పతిపాదముల నీవు ♦ భక్తిమై గొలుచుచు
నతనిసేవల నీవు ♦ నరయుమమ్మ
గీ॥ పతికి ప్రియమైన పనులను ♦ భక్తితోడ
సలిపి యాతని కెంతయు ♦ సంతసమును
గలుగజేయుము యోపుత్రి ♦ కనకగాత్రి
పతియె దైవము సతికెంతొ ♦ పద్మనేత్రి॥

గీ॥ క్రూరుఁడైనను మరి నీతి ♦ దూరుడైన
జారుడైనను మరి దురా ♦ చారుడైన
కోపియైనను మరియును ♦ బాపియైన
పతియెదైవము సతికెందు ♦ పద్మనేత్రి॥

మరియు,

గీ॥ బిడ్డరో! నాదుమాటలఁ ♦ బ్రియముతోడ
మానసంబందు నుంచుము ♦ మఱువకమ్మ
సీతమున్నగు సుపవిత్రి ♦ శీలవతుల
వలెను జరియించు మమ్మరో ♦ మాదుతల్లి॥

అమ్మా! కళా!

సీ॥ అందంబులకు నెన్న ♦ నా కాంతునినోప్పలు
సత్యంబు నెన్నగ ♦ సత్యమూర్తి

వీరత్వమెన్నంగ ♦ వీరాధివీరుండు
దాతృత్వమెన్నంగ ♦ ధర్మజుండు
ప్రేమంబునెన్నగ ♦ ప్రేమంపు ప్రతిమయు
పాండిత్యమెన్నంగ ♦ ప్రబలబుధుఁడు
వంశంబునెన్నగ ♦ ప్రఖ్యాతవంశంబు
న్యాయంబునెన్నగ ♦ న్యాయమూర్తి

గీ॥ ఇట్టి రమ్యుఁడు నీపతి ♦ కింపుమీర
నిన్నునిచ్చితి తల్లిరో ♦ నీవు నింక
మమ్ము తలపెట్టకుండగ ♦ మరువుమమ్మ
యరుగుమమ్మరో పతివెంట ♦ నమలచరిత॥

పుత్రీ! సత్కులసంజాతుఁడును, సుందరాకారుఁడును, రణధీరుఁడును, నీకనుకూలుఁడును నగు పతినిఁ బడసితివని మాహృదయం బానందంబొందుచున్నను చిన్నప్పటినుండియు ముద్దుగా బెంచి నీయాటపాటలఁజూచి యానందంబొందిన మాహృదయం బిప్పుడు నిన్నెడబాయవలయు నన్నవిచార మొందుచున్నయది.

చంద్ర—తండ్రీ! విక్రమాదిత్యా! మీ రిట్లూరకే వాపోవుచుండ రేల? "ధైర్యం పురుషలక్షణం" అనుమాట మరచిపోయితిరా? అన్ని తెలిసినవారలు మీరలే యిట్టుల చింతిలిన నావంటి తెలివిమాలిన యధీరురాలెంత చింతిలవలయునో కదా! ఇంకనైనను నామాటలను విని యూరడిల్లుడు.

విక్ర—అయ్యో! పిచ్చితల్లీ! నీవింకను చిన్నదానవు. నీకేమియుఁ దెలియదుసుమీ! మాకుఁ బ్రేమాస్పదురాలవై, మాముద్దులబిడ్డవై మాయింటియందు లక్ష్మీదేవివలె విరాజిల్లు నిన్ను మే మెడబాయుటకు మామన సెంతమాత్రమును నొల్లకున్నయదిగదా!

చంద్ర—జనకా! మీరిటుల నాకై చింతనొందుటఁ గన నామనసంబెంతయో చింతగానున్నయది. మీకూతురినై నేనెప్పుడు జననంబందితినో నన్నప్పుడే పరాధీనురాలిగా నెంచికొనుఁడు.

పద్మా—(చేరదీసికొని ముద్దిడుకొని) అమ్మా! చంద్రిక శా! నీవెంతటి పరాధీనురాలవైనను ముద్దుగాబెంచిన నిన్నెడబాయుటన మాకెంతయు విచారకరమేసుమీ! అదియుఁగాక నిన్నొంటరిగా పంపుటయనిన మామన మొప్పకున్నయది.

చంద్రి—తల్లీ! నేనొంటరిదాన నెట్లగుదును? దైవసమానుండగు మన్నాథుఁడు లేడా? ఇంకనైనను చింతమానుము.

కమ—(విక్రమకేతుఁజూచి) మహాప్రభూ! ప్రొద్దుపోవుచున్నయది. మనపని యేదియో త్వరగా నెరవేర్చుకొనిన బాగుగా నుండునని తోఁచుచున్నయది.

పద్మా—పుత్రీ! నీవు నీపతితోడ గజయూధంబున రత్నఖచితంబగు నంబారిపై యూరేగింపఁ జూడనోచుకొనలేదుగదా! నేనెంతటి దురదృష్టవంతురాలను!

(సైనికుఁడొకఁడు ప్రవేశించి)

సైని—(వందనమొనర్చి) మహాప్రభూ! మీయాజ్ఞప్రకారంబుగా సైన్యాధిపతిగారు సైన్యసమేతుఁడై ద్వారంబున వేచియున్నవాఁడు. (ఎదుటఁజూచి) అదిగో తురగంబు లాయత్తపఱచి యశ్వశిక్షకుఁడదేరథసమేతుఁడై యచ్చటనే వేచియున్నవాఁడు.

(ప్రవేశము - సైన్యాధిపతి)

సైన్యా—(వందనమొనర్చి) మహాప్రభూ! మీయాజ్ఞ శిరసావహించి సైన్యసమేతుఁడనై యిదే వచ్చియున్నవాఁడను.

విక్రి—(సైన్యాధిపతిఁజూచి) ఓయీ! వీరిప్రాణంబులు నీయాధీనంబులైనవి. నీవు వీరినెటులఁ దీసికొనిపోయెదవో? జాగ్రత్తసుమీ!

సైన్యా—రాజా! మీసేవకుండనగు నాకంఠమునందు ప్రాణములుండునంతవరకు వీరికేమియు భయములేదని గట్టిగా జెప్పఁగలను.

విక్రి—(చంద్రికళఁజేరంజీరి) తల్లీ! నీ వింక సుఖవై పోయిరమ్మా?
(సుదర్శనుఁజేరజీరి) నాయనా! సుదర్శనా! పోయివచ్చెదవా.

సుద—శ్వశురా! నీవెంతమాత్రిమును జింతిలకుము. మేమింకఁ బో
యివచ్చెదము.

పద్మా—(చంద్రికళను ముద్దిడుకొని) పుత్రీ! కళా!

గీ॥ పోయిరమ్మింక మాతల్లి ♦ పోయిరమ్మ
పతియె దైవంబటంచును ♦ భక్తితోడ
నతనిపాదములను గొల్వు ♦ మందముగను
మమ్ముఁదలపెట్టు మమ్మరో ♦ మాన్యచరిత॥

చంద్రి—(తలిదండ్రులకు నమస్కరించి) తలిదండ్రులారా! మీర
లింక నాకొరకెంతమాత్రిమును చింతనొందకుఁడు. నాకమల
నాచెంతనుండ నాకేమియుఁ గొదువలేదు.

కమ—(పద్మావతీ విక్రిమకేతులకు నమస్కరించి, పద్మావతితో) అ
మ్మా! నే నికఁ బోయివచ్చెదను. చంద్రికళవిషయమై మీ
రెంతమాత్రిమును చింతనొందవలదు. నేనుండ మీ కుమారిక
కేమియుఁ గొదువలేదు. ఇంక మాకు సెలవిండు, ప్రొద్దు పోవు
చున్నయది.

సుద—శ్వశురా! నే నింకఁ బోయివచ్చెదను.

చంద్రి—తలిదండ్రులారా! నేనింకఁ బోయివచ్చెదను.

పద్మా-విక్రి—పుత్రీ! పోయివచ్చెదవా? (వెంబడింతురు.)

(అందరు నిష్క్రమింతురు తెరపడును.)

(ప్రివేశము-వెంకడు డప్పుగొట్టుచు)

వెంక—ఓ ఓ ఓ ఓ ఓ! ఇనం డినం డినండి. నిన్నరా తెర్లిల్ల రాజుగారి

కూతుర్నెవరో ఎత్తుకపోయినారట. ఎత్తుకొనిపోయినోరెవరో తెల్లట. రాజుగారి యంతిపురమునఁ జూచినారట. ఆమ్మోరు దొరకలేదంట. రాజుగారు విచారపడ్తున్నారు. వారి కూతుర్ని తెచ్చేవారికి మడిమాన్యాలిచ్చి గొప్పచేత్తారటుల్లో!

(డప్పుఁగొట్టుచు నిష్క్రమించుచున్నాడు.)

(దుర్మదుడు ప్రవేశము)

దుర్మ—అన్నన్నా! ఏమి యీవింత! నాకేమియుఁ దోచకున్నయది. ఔరా! ఇదంతయు వీరి చిత్రముగాదుగదా? ఖడ్గధారులగు వీరవరులచే నెల్లపుడు కాపుండబడు రాజాంతఃపురంబునఁ జోరులు ప్రవేశించి రాజపుత్రిక నపహరించుట యున నాకేమియు దోచకున్నయది. (తలయూచుచు) మాచారుల నంపి యున్ని సంగతుల విచారించెదను.

(భటుఁడొకడు ప్రవేశించి)

భటు—మహాప్రభూ! మీ యాజ్ఞాప్రకారమే పురంబంతయుఁ దిరిగి సమస్తవృత్తాంతంబులఁ గనుగొంటిని.

దుర్మ—ఓహో! మంచిసమయమునకే వచ్చితివి. విశేషములేమి?

భటు—స్వామీ! నిన్నటిరోజున యర్ధరాత్రివేళ నెవఁడో యొక రాజపుత్రుఁడు కొంత సైన్యంబును వెంటనిడుకొని తానధిష్ఠించిన రథంబున రాజపుత్రిని నుంచుకొని యతిరయంబునఁ బాఱిపోవుచుండ జూచితిని.

దుర్మ—వారేదిక్కునఁ బారిపోవుచుండిరి?

భటు—ఇటకు దక్షిణదిశకుఁ బారిపోవుచుండెను.

దుర్మ—వారిసైన్యం బెంతవరకుండెనో చూచితివా?

భటు—ఒక వేయికన్న నెక్కువయుండదని నా యభిప్రాయము.

దుర్మ—(తలయూచి) ఇప్పుడు మనయొద్దనున్న సైన్యంబు రెండువేల కెక్కువగా నున్నయది. కొంతసైన్యమిచ్చి సురేంద్రు నయోధ్యాపురంబునకుఁ బంపి తక్కినసైన్యంబుచే మా రాజగు నయనపాలుని వెంటనిడుకొని వారి నడ్డగింతును. అటుపైన దైవమే కలఁడు. (భటునిజూచి) ఓయీ! నీవింక వెడలిపొమ్ము.

(నిష్క్రమించును.)

---

చతుర్థరంగము-అరణ్యము.

(ప్రవేశము-నయనపాలుడును, దుర్మదుడును ఖడ్గదారులై)

నయ—అమాత్యపుంగవా! దుర్మదా! నాకేమి చేయుటకును దోచకున్నయది.—అబ్బబ్బా! ఏమి వాని శౌర్యము! భారతవీరుఁడగు నాపాండవమధ్యమునకైనను ఇట్టి వీరత్వంబు గలదో? లేదో? వాని ధీరత్వంబును, వాని ఖడ్గచాలనంబును జూడ నావంటి వీరుఁడే యాశ్చర్యపరవశుఁడైన నింకొకరి మాటకేమి?

దుర్మ—రాజా! సింహోదరంబున నుదయించిన సింహకిశోరంబు, సింహకిశోరంబుగాక తుచ్ఛపుమేషసంతానంబవునే? ఆతండు వీరాధివీరుండగు జయవంతుని పుత్త్రుఁడుగాని వేరొకఁడు కాఁడు గదా!

నయ—అతనికిఁదోడొక మోటు భిల్లసైన్యముఁగూడ జేరుకొనినది. కటకటా! ఈ భిల్లులచే రెండువేలకుమించు మనసైన్యంబంతయు ధ్వంసంబైపోయెగదా!

దుర్మ—మహాప్రభూ! మీరెంతమాత్రమును జింత నొందకుఁడు. ఇతని ప్రాణములు మన యరచేతనే యున్నవి. మన మిప్పుడియయోధ్యాపురంబునకేగి మన మూలబలంబంతయుఁ దీసికొ

ని యాతనిని మట్టడింతము. అటుపైన నీతఁ డేమిసేయునో చూతము.

నయ—ఆహా! వీనిఁ జంపినగాని నామనం బూరటనొందదు.

దుర్మ—ఓ! నయనపాలమహారాజా! నాప్రతిజ్ఞ వినుము.

ఉ॥ పోయినఁబోవుఁగాక యిఁకఁ ♦ బొందిని ప్రాణము లెంతయేని, నా
కాయముఁ దునకతునకలయి ♦ గాకులు నన్ను భుజించుగాక, నే
బా యక యెట్టులైన నిదె ♦ పట్టుకవచ్చెద వాని నింక యా
నీ యమలాంఘ్రియుగ్మముల ♦నెంతయు నుంచెదఁజూడు భూవరా॥

నయ—ఆహా! నిజముగా నీ వంతటివాఁడవే! (ఆలకించి) ఓహో! ఏ మాయల్లకల్లోలము?

(తెరలోపలనుండి సుదర్శనుఁడు)

ఓరోరీ! దుర్మదా! కండకావరంబునఁ గన్నుమిన్నుగానక, యేమేమో కారు లరచుచుంటివిరా?

ఉ॥ ఓరిదురాత్మ!యోకలుష!♦యోయధమాధమ! యోరికూ్రర! యో
పారుఁడ! దుర్మదాంధకుఁడ! ♦ పద్దున నిన్నిదె నాదు ఖడ్గము
స్నీరుచు దునకతునకలుగ ♦ జేయుచు కాకులపాలు సేతు నా
వీరతఁజూపవచ్చితని ♦ వేగమె చూడుమి యోరి దుర్మదా!

(ప్రవేశము - సుదర్శన, పురంజయ, చంద్రశర్మలు, కొందరి భటులు వెంబడింప సేనాధిపతియు)

సుద—(పై విధంబునఁ జదువుచు ప్రవేశించి) పురంజయా చూచెద వేమి? ఆకూ్రరునిఁ బట్టుకొని బంధింపుము.

పురం—(పట్టుకొనఁబోవును).

దుర్మ—(కత్తిని ఝళిపించి) ఓరీ! దుర్మతీ! నిన్నిదే యమసదనంబున కంపుచుంటిని. కాచుకొనుము. (పురంజయునిఁ గొట్టును.)

పురం—(వేటుఁ దప్పించుకొని దుర్మదునిఖడ్గముపై కత్తిచేఁ గొట్టిన క్రిందఁబడిపోవును.) ఓరీ! పాపుడా! హనుమంతునియెడఁ గుప్పిగంతు లనురీతి నాయెడనా నీఖడ్గచాలనంబుఁ జూపించుట! (పట్టుకొని కట్టివేయును.)

సుద—(నయనపాలుఁ జూచి) ఓయీ! నయనపాలా! నిరపరాధుఁడగు నాపితామహుఁ జంపి, సకలసద్గుణవంతురాలగు మాతల్లి సుశీలాదేవిని, నన్నును, రాజ్యపరిత్యక్తులఁ జేసి, యడవిపాల్గావించియుఁ దనివిదీరక మమ్ముఁ జంపఁబూనుకొంటివా? అబ్బా! నీవెంతటి క్రూరుఁడవు!

నయ—ఓయీ! సుదర్శనా! యూరకే భీరుఁడవై నిలువఁబడి ప్రసంగంబులకు దిగుచుంటివి. నీయందు మగటిమి యున్నరా, రమ్ము యుద్ధమునకు.

సుద—పితామహా! నీవు పెద్దవాఁడవు, నేను చిన్నవాఁడను. నీతో నధికప్రసంగంబులాడుట తగదు. ఇంకనైనను మారాజ్యంబును మాకిచ్చి పుణ్యమునఁబొమ్ము.

నయ—ఓయీ! బాలకా! నీవింకను రాజ్యంబుఁ గోరుచుంటివా? నిన్నింక శమనునిరాజ్యంబున కధిపతిగావించెదను లెమ్ము. పిరికిపందవై నాతో యుద్ధంబుఁ గావింపకుంటివి. ఇదిగో! నిన్నిప్పుడే నాఖడ్గంబుచే రాజ్యాభిషిక్తుఁ గావించుచుంటిని. కాచుకొనుము. (కత్తి పైకెత్తును.)

(చంద్రకళ ప్రవేశించి)

చంద్ర—(తన ఖడ్గంబును నయనపాలుని కంఠంబున కడ్డంబుగానుంచి) ఓరీ! దుర్మతీ! నన్ను రణంబున జయించి నామనోహరునితోఁ బోరుము.

నయ—(ఖడ్గంబును క్రిందికిఁ దించుకొని నవ్వుచు) బాలా !

గీ॥ సుందరంబైన నీమేనుఁ ♦ జూడ నాకు
వింత గలుగుచునున్నది ♦ వెలదిమిన్న
నీదుహస్తము ఖడ్గంబు ♦ నెట్లుబూనె
యెటులయుద్ధంబుఁ జేసెదో ? ♦ యింతి నీవు.

చంద్రి—ఓయీ ! పెక్కుమాటలేల? రణధీరుఁడవైన నాతో బోరుము. లేనియెడల పారిపొమ్ము.

నయ—నీవింకను జిన్నదానవు. నీ కేమియుఁ దెలియదు.

గీ॥ ఇంతచిన్నతనంబున ♦ నింతి నీవు
యుద్ధమునుజేయ నెంచెదో ♦ యువిదమిన్న
జీవములపైన నీ వాసఁ ♦ జెందలేదె?
వలదు పలుకకు మిట్టుల ♦ వలదుబాల!

చంద్రి—ఓరీ ! నీవు వట్టి భీరుఁడవుసుమీ ! యుద్ధంబు జేయనెంచినరా రమ్ము. జీవములయందాస యునదయించినఁ బారిపొమ్ము.

నయ—ఓహో ! అంతకంతకు ముదురుచున్నయది . ఓసీ ! దుర్మతీ! నేనెంతజెప్పినను నీమనంబున నాటకున్నయది. నీకాయువు మూడినది. రా రమ్ము. (ఖడ్గంబును చంద్రికళపై వేయును)

చంద్రి—(వ్రేటుఁ దప్పించుకొని నాతనిశిరంబున నొక వ్రేటుచు వేయును.)

నయ—హా ! హా ! చచ్చితి. చచ్చితి. (కిందంబడిపోవును.)

చంద్రి—(ఖడ్గంబుఁ గ్రిందఁ బడవైచి) దుర్మతీ ! నీయాయు వింతటితో చెల్లు. పో పొమ్ము.

సుద—(చంద్రికళఁ గౌఁగిలించుకొని) మనోహారిణీ ! చంద్రికళా ! చంద్రికళా ! నీవింతటి వీరవనితవని నే నెన్నఁ డనుకొనలేక పోయితినిగదా!

పురం—తల్లీ! చంద్రికా! ఆహా! ఏమి నీయుద్ధకౌశలము! నేనిట్టి వీరత్వంబును సుకుమారగాత్రిలగు వనితలయెడల నెన్నఁడును గాంచి యెరుఁగను.

చంద్రశర్మ—అమ్మా! చంద్రికా! మాశత్రుఁడగు నయనపాలుఁడు నేఁడు నీచే హతుఁడయ్యెనని మాకెంతయో సంతసము కలుగుచున్నయది.

చంద్రి—(తలవంచుకొని) ప్రాణేశ్వరా! నే నెంతగొప్పపనిఁ జేయుచున్నను, మీయుదారస్వభావంబునఁ జేసి నన్నింతగా బొగడుచుంటిరి.

సుద—కలికీ! నే డతిసుదినము. మన శత్రుఁడొకఁడు నీచే హతుఁడయ్యె. (పురంజయ చంద్రశర్మలఁ జూచి) మన మీసువార్త మనతల్లిగారగు సుశీలాదేవి కెఱింగించి సంతసింపఁజేయుదము, రమ్ము. (అందరు నిష్క్రమింతురు)

(తెరపడును.)

ఇది పంచమాంకము



శ్రీరస్తు

# చంద్రకళా స్వయంవరము

## షష్ఠాంకము

### ప్రథమరంగము

(మునివనవాటికయందు చంద్రికళాసుదర్శను లొకయుయ్యెల నూగుచుందురు. కమల, నీరద, శారద మొదలగువా రొకతట్టున నాటలాడుచుందురు)

సుద—(చేతఁజూపుచు) కలికీ! చూచితివే ఇవ్వనసౌందర్యము! అటుఁజూడుము.

ఉ॥ నీటను దేలి యాడుచును ♦ నిండుగ నాకమలంబు లెంతయు
న్నీటుగనొప్ప నాకొలను ♦ నెంతయు రమ్యము నందజేయుచు
న్నాటిగ తుమ్మెదల్ రవము ♦ తద్దయుసల్పుచు చెంతిజేరగా
నీటుగనొప్ప నీకనుల ♦ నేలగ గన్పడుగాదె సుందరీ!

ఓ బింబోష్ఠీ!

చ॥ జలజలయంచు బాఱుఁగడు ♦ చక్కని యీసెలయేళ్ల జూడుమీ
జలజదళేక్షణా వినుము ♦ చక్కగ పాడుచునుండె కోవెల

ల్కుల్కరో కాంచుమా యదిగో ♦ కాంతులనీనెడి పవ్వమంజరు
క్వాలసిన యాలతాగృహము ♦ వేడ్కను దంపతు లుండగోరెడిన్॥

ఓ రాకేందుముఖీ! ఆమల్లికాలతాదు లేవిధంబున నవీనదంపతుల యాలింగనమువలెఁ జుట్టుకొనియున్నవో చూడుము. వాల్గంటీ! ఇటు చూడుము.

సీ॥ అలివేణి నీదగు ♦ యందఁపుఁజనుదోయి
బోలు నెంతేని యా ♦ పుష్పములను
కలికి నీచిన్నని ♦ కాంతిగుల్కెడి మోవి
నీదొండపండును ♦ నెంతో పోలు
నిందీవరాక్షి నీ ♦ నీలంపుఁగురులెంతో
యీతుమ్మెదలఁబోలు ♦ నింపుగాను
కడువింతయైన నీ ♦ కటిచక్రమారయ
నిసుకతిన్నెలఁ బోలు ♦ నింపుమీఱ
గీ॥ నిన్ను సృజియించె నాబ్రహ్మ ♦ యెసక మెసఁగ
నన్ను సుఖియింపుమనుచు నా ♦ నందముగను
నీవు నేకూర నాకింక ♦ నీరజాక్షి
నాదుభాగ్యంబు తరమె యె ♦ న్నంగ నెందు॥

(తనమెడనున్న హారంబునుజూపి) వాల్గంటీ! నీసుందరముఖారవిందసందర్శనంబుకొరకై, నేను మదనజ్వాలానలకీలలం బడి భస్మీభూతుఁడ నగుచుండ, నీమనోహరతారహారంబే నన్నుఁ దరిజేర్చి రక్షించినయది.

చంద్రి—(సిగ్గుచే దలవంచుకొని చిరునవ్వునవ్వుచు) ప్రాణేశ్వరా! ఈహారంబు తమ కేవిధంబున లభించినయది?

సుద—మనోహరీ! నీసుందరవదనారవిందసందర్శనలాలసుఁడనై నిన్నుఁ గాంచుటకొరకె వాపోవుచుండ, నాప్రియమిత్రుఁడగు పురం

జయుఁడు నన్నోదార్చి నీ కాంతను నెటులనైనను గూర్తునని యు, నీవెంతమాత్రముఁ జింతిల్లకుమని నీచెంతకు వైద్యవేషంబు న నేతెంచి, నీచే నీహారంబును బహుమతిగాఁ గయికొనెనట.

చంద్రి—ఆహా! ఏ మీాచిత్రము! వైద్యవేషంబున నరుదెంచినవాఁడు పురంజయుఁడేనా? ఔనౌను. నేనును, నాచెలియును నప్పుడే యానుమానపడితిమి. (తనహస్తముచే కమల మొదలగువారిఁ జూపి) మనోహరా! అటు తిలకింపుఁడు. మన కమల మొదల గువార లేమో యాడుకొనుచున్నవారు.

కమ—చెలీ! నీరదా! పుష్పమాల నీ వతినిపుణతతోఁ గట్టెదవట! నా కొక పుష్పమాలఁ గట్టియియ్యవా?

శార—సఖీ! కమలా! మానీరదకట్టు పుష్పమాలలఁ జూచి సుదర్శ నుఁడుగూడ సంతసించును.

నీరద—సోదరీ! కమలా! నీకుఁ గావలసినన్ని కట్టియిచ్చెదనులే.

చంద్రి—(ఉయ్యేలదిగి చిఱునవ్వానసేమఁదోఁప) సోదరీ! నీరదా! నాకుఁగూడ నొకపుష్పమాలఁ గట్టియిమ్మా!

కమ—(నవ్వుచు చంద్రికళఁజూచి) మాతో నీకేమిపని? నీమనోహరు నిచెంత కేగుము. (నీరదఁజూచి) సోదరీ! నీరదా! ఈచంద్రికళ కుఁ బుష్పమాలలఁ గట్టియియ్యకుము. ఈమెమనోహరుఁడే, యీామెకుఁ బుష్పమాలిక. తనమనోహరునిచెంత కేగుమనుము. నాచెంతి కెందులకు వచ్చినదియది?

చంద్రి—ఔనే! నీవెంతటి వగలాడివే! చాలుఁజాలు. నీవు వద్దనిచెప్పి నను మానీరద మాకుఁ గట్టియిచ్చునులే! (నీరదఁజూచి)సఖీ! నీరదా! నాకుఁ బుష్పమాలలఁ గట్టియియ్యవా?

నీర—నేనందరికిఁ గట్టియిచ్చెదనులే.

కమ—(తలఁద్రిప్పుచు) ఆ! ఇంకేమి? నీకుఁగూడ కట్టియిచ్చునటలే!

ఇంతలోఁ గుఱిదీరినదా? (ఎదుటఁజూచి) అదిగో! పావన మూర్తియగు సుశీలాదేవిగా రిచటికే వచ్చుచున్నారు.

(ప్రవేశము—సుశీలాదేవి)

సుశీ—ఆహా! వీరలఁజూచిన చింతాకులంబగు మన్మానసం బమందానందం బొందుచున్నయది. (చంద్రికళఁజూచి) ఆహా!

గీ॥ అందముగనున్న యీచిన్ని ♦ యంబుజాక్షి
మోమువీక్షింప నెంతయు ♦ ముదముగల్గు
నిట్టిసుందరమూర్తిని ♦ నింపుమీఱ
కోడలిగ జేకొనంగను ♦ గోర్కెదీరె॥

సుద—(ఉయ్యాలనుండిదిగి చెంతకేతెంచి) మాతా! నీపుత్రుఁడగు సుదర్శనుఁ డిదే నమస్కరించుచున్నవాఁడు. (మ్రొక్కును.)

చంద్రి—(వినయముతో) తల్లీ! నీకోడలగు చంద్రికళ యిదే మ్రొక్కుచున్నయది. (మ్రొక్కును.)

సుశీ—(చంద్రికళాసుదర్శనులఁ జెంతకు దీసికొని) కుమారా! సుదర్శనా! పుత్రీ చంద్రికళా! నానయనద్వంద్వంబులవలె నొప్పు మిమ్మిద్దఱఁగాంచిన నాడెందం బమందానందపారావారవీచికలఁ దేలియాడుచున్నయది. (కమలఁజూచి) పుత్రీ! కమలా! నీ వతిసుగుణగణ్యవు. నిన్నుఁ దిలకింప నాకెంతయు నానందం బయ్యెను. అదియుఁగాక నీవు మాపురంజయుని వరించి వివాహం బాడితివని వినినప్పటినుండియు, నేనెంతయు సంతసించితిని.

(ప్రవేశము - పురంజయ చంద్రశర్మలు)

పురం—మిత్రమా! చంద్రశర్మా! అదిగో! పావనియగు సుశీలాదేవియు, మన చంద్రికళాసుదర్శనులును నిచ్చటనే యున్నవారు. రమ్ము.

చంద్రిక—(నవ్వుచు) ఓహో! నీమనోహారిణియగు కమలయును నిచ్చటనే యున్నయది. చెప్పవేమి!

పురం—(నవ్వుచు) ఓహో! ఔనౌను! మఱచితిని. నామనోహారిణియగు కమలకూడ నిచ్చటనే యున్నయది.

సుశీ—(పురంజయుని జూచి) పురంజయా! విశేషములేమి?

పురం—(చంద్రికర్మనుజూచి) మిత్రమా! అమ్మగారేమో యడుగుచున్నయది. చెప్పవేమి?

చంద్రిక—అమ్మా! సుశీలా! నేనయోధ్యాపురంబునకేగి యచ్చటి వృత్తాంతంబులన్నియుఁ గనుఁగొంటిని. అచ్చటి పౌరులనందరిని సురేంద్రుఁడతికౄరముగా హింసించుచుండెను.

సుశీ—కటకటా! ఎంతదుర్మార్గుఁడెంతదుర్మార్గుఁడు!

సుద—తల్లీ! అట్టి దుర్మార్గుని రాజ్యపరిచ్యుతుఁజేసిన బాగుండును గదా!

సుశీ—నేనదే తలచుచుంటిని. కాని సైన్యహీనులమగు మనము వానిని జయించుట దుర్ఘటంబని తోఁచుచున్నయది.

పురం—మీరీవిషయమై చింతనొందనేల? మేమెటులనయినను నతని రాజ్యపరిచ్యుతునిఁ గావించి మన సుదర్శనుని సింహాసనం బధిష్ఠింపఁజేయుదుము.

సుశీ—పురంజయా! మీరు తలపెట్టినకార్య మేది నెరవేరదు!— అదిగో! మన గురువుగారగు యోగానందస్వామిగారును నిచటికే వచ్చుచున్నవారు.

(ప్రవేశము - యోగానందస్వామి.)

యోగా—నారాయణ! నారాయణ!

అందరు—(నమస్కరింతురు.)

యోగా—(దీవించి) మిమ్ములనందరినిఁజూడ నాకెంతయు నానందం

బయ్యేను. మీకొరకై ప్రసాదములనుంచితి. మీరందరును రండు.

(అందరును వెడలిపోవుదురు.)

(తెరపడును.)

ద్వితీయరంగము - అయోధ్యాపుర రాజభవనము.

(సురేంద్రుడును, దుష్టసేనుడును, కుర్చీలపై కూర్చొనియుందురు. వారికిముందర టేబిల్ పై సారాయముచే నింపబడిన రెండు గ్లాసులును, నొక సీసాయును.)

సురే—(గ్లాసులోనున్న సారాయముఁదాగి) ఆహా! మధురపానమా!

శా॥ నిన్నుంబోలఁగ నేవిలేవుగద యో ♦ నీటొందు సారాయమా
నిన్నే యెల్లరుఁ బూజసేతురుగదా ♦ నీరీతి యెంతోకదా!
నిన్నుంజేకొని వానికెల్ల యపుడు ♦ స్నైక్యోల్ప దే స్వర్గము౯
నిన్నే చేకొని సంతసించితిఁగదా ♦ నేనిందు సారాయమా॥

ఓ! మధుపానమా! నీవే పరబ్రహ్మస్వరూపవుసుమీ! నిన్నుఁ జేకొనినవారిడెందం బానందపారవశ్యమున ముంచు దానవుగదా! (దుష్టసేనునిజూచి) అమాత్యవరా! నీవింకను సారాయమును బుచ్చుకొనవేమి?

దుష్ట—మహాప్రభూ! మీయాజ్ఞకాలేదని యూరకొంటిని. లేనియెడల నప్పుడే పుచ్చుకొనువాఁడనే.

సురే—(పకపకనగుచు) దీనికిఁగూడ నాయాజ్ఞయేకావలయునా! నీయిష్టమువచ్చినటుల పుచ్చుకొనుము.

దుష్ట—చిత్తము. (పుచ్చుకొని) ఆహాహా! ఏమి దీని మాధుర్యము

అల సురాసురులు కష్టపడి సముద్రమునుండి తీసిన యమృతం బయినను దీనికి సాటిరాదుగదా!

(ప్రవేశము - ఒక సాధు.)

సాధు—(సురేంద్ర దుష్టసేనులఁ జూచి) కటకటా! రాజ్యపాలకులగు రాజులే యిటువంటి త్రాగుబోతులైయుండ, ప్రజ లేవిధంబున సుఖయింతురు. హా! దైవమా!

గీ॥ పావనంబౌచు వెలయు నీ ♦ భరతభూమి
త్రాగుబోతులపాల్సేసి ♦ దనరినావు
నిట్టివారలు ప్రజనెట్లు ♦ నేలికొందు
ప్రజలు సుఖయించుటెట్లొకో! ♦ బాగుగాను॥

అక్కటా! ఈ త్రాగుడు మన భరతభూమి నంతయుఁ జెఱుపుచున్నయది—కానీ! వీరి కీత్రాగుడు చెడ్డదని బోధిం చెదఁగాక! అటుపైన దైవమే గలఁడు. చెంతకేగి (సురేంద్రు జూచి) రాజపుత్రా! పావనంబగు క్షత్రియవంశంబున నుదయించి సచ్చారిత్రుఁడగు జస్వంతునిపుత్రుఁడవై నీవిట్టి దుష్టకార్యం బు లొనరించుటజూడ నాకెంతయు విచారము గల్గుచున్నయది.

సురేం—(పకపక నగుచు) ఓయీ! పిచ్చివాడా! నీత్రోవ న్నీవు బొమ్ము. మాతో నీకేల?

సాధు—ఓయీ! దుష్టవర్తనా! నేజెప్పుమాట లాలకించి యిప్పుడైన ను నీసారాయముఁ ద్రాగుట విడిచిపెట్టుము.

సురేం—ఆహాహా! ఓయీ! వెఱ్ఱీ! నీవుగాదు. నిన్నుబుట్టించిన బ్రహ్మయైనా న న్నీసారాయమును వదలుమని బోధించినను వదలువాడనుగాను. పో పొమ్ము.

దుష్ట—ఓయీ! పిచ్చిసాధువా! నీవు జాజురంగులనుఁ బూసిన బట్ట లను పొడఁగికొని దొంగసాధువై వచ్చినంతనే మేము నీవఁ

జేసెదమనుకొంటివా? హాహా మ్మూరకే లేనిపోని కూతలఁ గూసి మా కాగ్రహంబును గలిగింపకుము.

సాధు—ఓయీ! దుష్టులారా! నామాటలవినక మీరూరకే చెడి పోవుదురుసుమీ!

సురేం—హాహామ్మా పిచ్చికూతలు మాయొద్దఁ బనికిరావు. నీ కీసారా యముసంగతి యేమియుఁ దెలియదు. తెలిసినయెడల నీమాట లాడకుందువు.

దుష్ట—(సారాయమును గలాసుతో నింపుకొని త్రాగి గలాసుఁ జూపుచు) ఆహాహా! సారాయమా! నీసంగతిఁ దెలియక యూర కే యీపిచ్చిసాధు నిన్ను నిందించుచున్నవాఁడు. నీవే మిపాపము జేసితివో! (సాధుఁజూచి) ఓయీ! సాధూ! నీ వీసారాయమునుఁ బుచ్చుకొని యానందించెదవుగాని రా రమ్ము.

సాధు—ఓరీ! దుష్టపిశాచమా! పరబ్రహ్మస్వరూపులమగు మమ్ముల సారాయముఁ ద్రాగుమనియెదవా? ఔరా! నీవెంతకూ్రరుఁడవు!

సురేం—ఓరీ! పిచ్చిమాట లేలవాగెదవు? దీనికన్న మిన్నయైనవస్తు వేదియును లేదు. దీనిని సేవించిన యానందపారవశ్యంబు గావించును. "ఆనందో బ్రహ్మ" యని పెద్దలు నుడువుచున్న వారు. కావున నియ్యదియే పరబ్రహ్మస్వరూపము. ఇంక నీవు దీనిని బుచ్చుకొని, సాక్షాత్పరబ్రహ్మస్వరూపుండవు గమ్ము.

సాధు—ఛీ! ఛీ! మీరు రతిమన్మదాంధులు. మీతో మాటలాడుట కన్న యూరకున్నది మేలు. దుష్టులకు మంచిమాటలఁ జెప్పిన తామరాకుపై నీటిబిందువువలె వారిమనంబున నాటకుండును

గదా! హా! పరాత్పరా! దీనబంధూ! ఇట్టి దుష్టాధముల రాజ్యంబుల నేలఁబెట్టి ప్రజలను మంటగలపనెంచితివా? హరి హరీ! ఎంతపాపు లెంతపాపులు!

గీ॥ కన్ను మిన్నునుఁ గానక ♦ గట్టిగాను
నవ్వుచును బల్కి రెంతయున్ ♦ దవ్వులేదు
త్రావగా రమ్మటంచును ♦ దద్దయు నను
జేరబిలిచిరిగద యయో! ♦ చెప్పతరమె.

(నిష్క్రమించును.)

సురేం—మంత్రిశేఖరా! వీఁడు మనసారాయమురుచి నెరుఁగక లేని పోనిమాటల నీ సారాయమును నిందించుచున్నవాడు.

దుష్ట—(నవ్వుచు) మహాప్రభూ! వాడు మనకు సారాయముఁ ద్రాగవద్దని బోధింపవచ్చి మనముచేయు బోధనల సమ్మతించి సిగ్గుచే బారిపోయెను.

సురేం—మాతాతయగు నయనపాలుఁడు నామనోహారియగు చంద్రికళం దెచ్చుటకై తనమంత్రిసమేతముగా వారణాసీపురంబు ననే యాగిపోయెను. ఆచంద్రికళయే నామనోహారిణియైన నా యానందమున కింక మేరయే లేదు. ఆహా!

గీ॥ నేను నా కాంతనెంతయు ♦ నింపుమీర
జేకొనంగను నింకను ♦ జెప్పఁదరమె
నాదు భాగ్యంబుఁ బ్రబలును ♦ నాడెముగను
నన్ను బోలెడివారల ♦ నెన్ను గలదె?

దుష్ట—అయోధ్యాపురీశా! సురేంద్రమహారాజా! నిజముగా మీ రాకాంతను జేకొన నింద్రాదులకైనఁ బట్టని వైభవము మీకు బట్టును.

సురేం — ఈయానందంబునకుఁ దోడుగా గానవినోదంబుల నలిపిన

నింతకన్న నెక్కుడానందం బుదయించును. (అటు నిటు జూచి) ఓరీ! సేవకా! ఇటు రమ్ము.

(భటుడు ప్రవేశించి)

భటు—చిత్తము.

సురే—ఓరీ! నీవిప్పుడే పోయి, మనపురంబునఁ బ్రసిద్ధికెక్కిన యొక్క భోగకాంతం బిలుచుకొనిరమ్ము.

భటు—చిత్తము. (నిష్క్రమించును).

దుష్ట—మహాప్రభూ! నిజముగా నీయానందబుపై గానవినోదంబును సల్పిన, డెందం బానందపారవశ్యంబున దేలును. (ఎదుటఁ జూచి) అదిగో! తిక్కుచు, తారుచు, నిక్కుచు, నీల్గుచు, సొక్కుచు, సోలుచు, టిక్కుటిక్కున నొక చిల్కలకొల్కి యిటకే వచ్చుచున్నయది.

(ప్రవేశము—భోగవనిత)

భోగ—(వందనమాచరించి నిలువఁబడును.)

సురేం—ఓసీ! నీపేరేమి?

భోగ—చిత్తము. దాసురాలిపేరు రత్నమాలయందురు.

దుష్ట—ఓహో! పే రతిరమణీయముగా నున్నయది!

సురేం—నీకాటపాట లేమైన వచ్చునా?

భోగ—చిత్తము. తమపురంబునఁ బ్రసిద్ధిగాంచినదానను నేనొక్కతెనే.

(ప్రవేశము-కొందరు సైనికులు.)

సైని—(గడగడ వణకుచు) మహాప్రభూ!

సురేం—ఏమి టాసమాచారములు?

సైని—మీ తాతగారగు నయనపాలమహా రాజుగారు యుద్ధంబున వార ణాసీపుర రాజపుత్రికయగు చంద్రికచే హతుఁడయ్యెను.

సురే—(తలమోదుకొనుచు) కటకటా! ఎంతఘోర మెంతఘోరము! మా తాత హతుఁడయ్యెనా! (కుర్చీనుండి లేచి లోపలికిఁ బరు గెత్తును.)

అంద—కటకటా! ఏమి యీవింత! (నిష్క్రమింతురు.)

(రత్నమాల తిరిగి ప్రవేశించి)

రత్న—కటకటా! రాజుగారియొద్దను బాడవలయుఁగదా యని మంచి వేషమును వేసితిని. కాని యేమియుఁ బ్రయోజనము లేకపో యెను. (నిష్క్రమించును.)

తృతీయరంగము - అయోధ్యాపురసమీపారణ్యము.

(ప్రవేశము - చంద్రశర్మ, కమలాపురంజయులు)

పురం—(చేతఁజూపుచు) ప్రాణేశ్వరీ! అల్లదే! కానవచ్చుచున్నయదే! దానిఁ జూడుము.

సీ॥ సకలసంపదలకుఁ ♦ జక్కనినిలయంబు
మంజులంబైనట్టి ♦ మహిమగలది
వైభవోపేతమై ♦ వరలెడిస్వర్గంబు
నింపొందఁజేసెడి ♦ నింపుతోట
భోగంబులకునెల్ల ♦ బుట్టినయిల్లును
నానందమైనట్టి ♦ యాలయంబు
మండితంబైనట్టి ♦ మందారవృక్షంబు
సంతసింపగఁజేయు ♦ సంపదయును

గీ॥ పట్టణంబులకెల్లను ♦ బట్టణంబు
బాలవేవియు దీనినిఁ ♦ బుడమియందు

నింపుమీరంగనున్నట్టి ♦ యీపురంబు
వైభవంబును జూడు మో ♦ భాసురాంగి॥

మనోహారిణీ! శోభాయమానమై, సౌందర్యరాశియై, యానంద దాయకంబై, సకలసంపదలకు స్వర్గంబునుబోలి జాజ్వల్యమానంబై, ప్రకాశంబునొంది చూపరులడెందం బానందపారావారవీచికలఁ దేలియాడింపఁ జేయుచున్న దీ యయోధ్యాపురంబుసుమీ! అహాహా! ఏమి యీపురంబుసొంపు! వర్ణనాతీతంబై గన్పట్టుచున్నయదిగదా?

కమ—మనోహరా! దుష్టదానవసంహారుఁడును, పరబ్రహ్మస్వరూపుడును, శ్రీమన్నారాయణాంశసంభూతుఁడును నగు శ్రీరామచంద్రుని జన్మస్థానం బియ్యదియేనా? అహా! ఏ మీపురము సొంపు! రెండవస్వర్గంబువిధంబునఁ గన్పట్టుచున్నయదిగదా! అహా! నాజన్మంబు సార్థకంబయ్యె. నాహృదయంబు పవిత్రంబయ్యె. నాదేహంబు పావనంబయ్యె.

చంద్ర—కమలా! సకలసద్గుణవంతుఁడును, న్యాయమూర్తియు నయిన సుదర్శనునితండ్రి జనస్వంతుఁడు రాజ్యపాలనంబుఁ గావించుచుండ నిచ్చటిప్రజ లప్పు డెంతయును సుఖముగా నుండిరి.

కమ—విప్రవర్యా! మునుపటివలెనే యిప్పటిప్రజలును సుఖయించుచుండిరా?

చంద్ర—సుఖమా? కలలోనివార్త!

కమ—ఏ మటు లనుచుంటివి?

చంద్ర—ఇప్పు డేలుచున్నవాఁడు సుదర్శనునిసహోదరుఁడు. వాడతిదుర్మార్గుఁడై ప్రజలఁ జెప్పరానియిక్కట్టులఁ బెట్టుచున్న వాఁడని నే నిదివరకే తెల్పితిఁగదా?

కమ—ఔనౌను. వినియుంటిని.

చంద్రి—వానిక్రూరత యింతింతనరాదు.

గీ॥ జనుల నెంతయు హింసించి ♦ చావఁగొట్టి
పన్ను లెక్కువ విధియించి ♦ పాపమనక
యవియు నియ్యకయున్నను ♦ ననుపుఁ జెరకు
క్రూరతనుఁ దోఁప హింసించు ♦ క్రూరుఁడెంతొ॥

కమ—హరిహరీ! ఇట్టిపాపులకే దైవంబు సాయపడునుఁగదా!

(ప్రవేశము - ఒకపౌరుఁడు.)

పౌరు—హా! దైవమా! నీకై నను మాయందు దయరాకపోయెనుగదా! ఆహా!

మ॥ ధనమానంబులు వోయె నయ్యయొ కన ♦ ద్ద్రవ్యంబు శూన్యంబునై
తినఁ గూడైనను లేకపోయెనుగదా ♦ యేమందు నాకింక యీ
వనమే దిక్కుగఁ జేసినాఁడ వకటా ♦ వాపోవ నిందింక హా!
జననంబొందుటనుండి యాకటికి నే ♦ జావంగలేదెప్పుడున్॥

(క్రిందఁగూలఁబడి) హా! హా! ఎంతయిక్క టెంతయిక్కట్టు! క్రూరుండగు యీసురేంద్రుఁడు మమ్ముల నెంతటి బాధలఁ బెట్టుచుండె. కట్టా! ద్రవ్యాధిపతినగు నేనిప్పుడు ద్రవ్యహీనుఁడనై కూటికిఁ గుడ్డకుఁ గుందవలసివచ్చెగదా!

పురం—(పౌరునిచెంతకేగి) అయ్యా! మీ రెవరు? మీ రిటుల దుఃఖం బొంద కారణంబేమి?

పౌరు—అయ్యా! కూడును గుడ్డయునులేక కష్టపడు మాతో నీకేమి పని? మాకష్టముల నార్చెదవా? తీర్చెదవా?

పురం—అయ్యా! నీకష్టంబేదో చెప్పిన నాచేతనయినంత సహాయం బొనరించెదను.

పౌరు—అయ్యా! నీ వెవరో పుణ్యమూర్తివివలెఁ గన్పట్టుచున్నావు. నీవడుగుచుండ నాసంగతి నుడువకుండుట తగదు.—నేనీపురంబుననుండెడి యొక రత్నవిక్రయుఁడను. దానివలన నన్నందరు రత్నపాలుఁడందురు.

పురం—ఓహో! నీవు రత్నపాలుఁడవా? ఆహా! ఎంతటివాని కెంతటి గతి వచ్చినయడ! తరువాత?

పౌరు—అయ్యా! నీ వెవరో? నాపేరు నీకుఁగూడా తెలియునా?

పురం—అవును. నేను వినియుంటిని. నీ విట్లవుటకుఁ గారణం బేమి?

పౌరు—అయ్యా! నేనిట్లవుటకుఁ గారణం బా? ఇప్పురపాలకుఁడగు సురేంద్రుఁడు—అబ్బబ్బా! వాని నామమును దలచిన నాగుండె యిప్పటికిని నదరుచున్నయది. వాఁడు నాపయి లేనిపోని యపరాధంబులఁ బెట్టి, నేమియు నెరుగని నన్ను హింసించి, నాసర్వస్వంబు నపహరించి, నాపుత్త్రకళత్త్రసహితంబుగా కారాగారంబున ద్రోసివేసెను. నే నిప్పుడు పుత్త్రకళత్త్రసహితంబుగాఁ గారాగారవిముక్తుడనై, తినఁ గూడును, కట్ట గుడ్డయును లేక, నీయడవియందుఁ గొన్ని గట్టెలఁగొట్టి, యమ్ముకొనిన నేమైనఁ జీవనంబు జరుగునేమో యని యిటకుఁ గట్టెలఁ దీసికొని పోవవచ్చితిని.

పురం—ఆహా! యెంతకష్ట మెంతకష్టము!

పౌరు—అయ్యా! మీ రెవరో నేను దెలియఁగోరుచున్నవాఁడను.

పురం—రత్నపాలా! నేను జస్వంతునియమాత్యపుంగవుఁడగు బుద్ధిమంతుని కుమారుడ. నా పేరు పురంజయుఁడందురు. (చంద్రశర్మఁ జూచి) ఇతఁడు రాజపురోహితుఁడగు సుదేవుని కుమారుఁడు. ఇతనిని చంద్రశర్మ యందురు.

పౌరు—ఏమేమీ! నీవు పురంజయుఁడవా? ఆహా! ఎంతటిసంతోష

వార్తను వింటిని! అయ్యో! జన్వంతుని ప్రియపుత్రుఁడగు సుదర్శనుఁ డిపు డెందున్నవాఁడు? మీాకేమైనం దెలియునా?

పురం—అతఁ డిప్పు డిచ్చటికి కొంతదూరమునసున్న నొకమునివన వాటికయందు తనతల్లియగు సుశీలాదేవితో సుఖముగా నున్నవాఁడు.

పౌరు—అతఁ డిప్పుడు పెద్దవాఁడై యుండనోపును. దుర్మార్గుఁడగు నీసురేంద్రుని సింహాసనంబునుండి తొలగించి యాతని నుంచిన బాగుగానుండును.

పురం—మే మదేప్రయత్నమునకై వచ్చితిమి.

పౌరు—ఇచ్చటి దండనాయకుండగు శూరసింహుఁడు సురేంద్రుని రాజ్యపరిచ్యుతుఁ గావించి, సుదర్శనునకి రాజ్యంబొసంగవలయు నని దేశదేశంబులకుఁ దనభటుల నంపి నాతనిజాడ నరయుటకై పంపెను. కాని యాతఁడెందును గానఁబడ లేదట—ఈవార్త నాతని కెరింగించిన నెంతి సంతసపడునో! ఇవ్వార్త నాతని కెరింగింతముగాని రండు.

చంద్రి—ఓహో! అటులనా? అయిన మంచిదే.

పురం—చంద్రివర్మా! ఇవ్వార్త నాతని కెరింగించి, అతని సహాయముఁ బడసెదము గాని రమ్ము. (కమలఁజూచి) మనోహరీ! దైవంబు మనకెంతయు ననుకూలించెను. రా రమ్ము.

(అందరు నిష్క్రమింతురు)

తృతీయరంగము - దండనాథునిగృహము.

(ప్రవేశము - దండనాయకుఁడగు శూరసింహుఁడు.)

శూర—కటకటా! న్యాయమూర్తులగు రాజవరేణ్యులచే ప్రసిద్ధిఁ

జెందిన యీరాజ్యము నేడు దుష్టులపాల్పడి మలముల మాడి పోవుచున్నయదిగదా! —ఓయీ! పాపీ! దుష్టసురేంద్రా! నీవెంతటి ప్రజాద్రోహివైతివి! ఆహా!

సీ॥ నీమూలముననెగదా ♦ నీటూఁదు నీపురి
పౌరులెంతయు నయో ♦ మాడుచుండ్రి
నీమూలముననెగదా ♦ నెలకొన్న జనులంత
కూటికై మాడుచు ♦ కూలుచుండ్రి
నీమూలముననెగదా ♦ నిధియుక్తులైనను
కట్ట బట్టనులేక ♦ క్రాఁగుచుండ్రి
నీమూలముననెగదా ♦ నెక్కొన నెటఁగన్న
దీనాననులు జనుల్ ♦ తిరుగుచుండ్రి
గీ॥ ప్రజలనెంతయు కష్టముల్ ♦ పాలుజేసి
క్రూరతను దోపఁజేసెడి ♦ క్రూరుఁడవుగ
పావనంబైన నీవంశ ♦ భవ్యత చెడఁ
జేసికొనదవుగద యోయి ♦ చెనటివాఁడ.

అబ్బబ్బా! ఇప్పటికిని నాహృదయంబు జల్లుమనుచున్నయది. ఎచ్చోటవిన్నను "యన్నమో రామచంద్ర" యనువారె. ఎచ్చట తిలకించినను పొట్టకూటికై మలమలమాడు దీనాననులయార్తి యే. కటకటా! వారి దీనావస్థను దిలకించిన నాహృదయం బిప్పటికిని దడదడఁ గొట్టుకొనుచున్నది. ఇద్దుర్మార్గుని రాజ్యపదచ్యుతుఁ గావించి నింకొకని కీ రాజ్యం బొసంగుదమన్నను సత్కులసంజాతుఁడును, న్యాయమూర్తియు, నగు జన్వంతుని నామం బంతరించునేమో యని నామనంబంతయు చింతాకులంబై పోవుచున్నది. పావనులగు సుశీలాసుదర్శనులకై నా చారుల నంపి దేశమంతయుఁ జూడనంపితినిగాని, వారిజాడ యే మాత్రమును దెలియలేదు. రాజ్యమం దల్లకల్లోలముఁ దిలకించిన నీవిధంబుగా నున్నది. వీనిబుద్ధి మరలింతమన్నను,

దుర్మదాంధుఁడగు దుష్టసేనుఁడు వీనిని బాగుపడనియ్యఁడు. ఇదియంతయు యోచింప నా కెటుబోవుటకుఁ దోచకున్నయది. కట్టా! నేను దండాధ్యక్షుఁడనయ్యు నీపనికై నేనొక గడ్డిపోచ కైనను నలవిగాకుంటిని.

(భటుఁడు ప్రవేశించి)

భటు—మహాప్రభూ! తమరిదర్శనార్థంబై యెవరో కొంద ఱేతెంచి నారు.

శూర—సరే! రమ్మనుము.

(ప్రవేశము - చంద్రిశర్మ, పురంజయులు)

చంద్రిశ—దండనాయకా! శూరసింహా! నీదర్శనంబైనందుకై మే మెంతయు సంతసించితిమి.

శూర—(పీఠంబుఁజూపించి) అయ్యా! మీరీయాసనం బలంకరించుఁడు.

పురం—మేము మీవలన కొంతసహాయముఁ బడయవచ్చితిమి.

శూర—(తనలో) ఏమిది! నావల్ల వీరి కేదియో సహాయము గావలయునట. వీరిముఖముల వీక్షింప నేను వీరి నెచటనో చూచిన జ్ఞాపకమున్నయది.

పురం—యోచించుచుంటి రేల?

శూర—మరేమియు లేదు. మిమ్ముల నెచ్చటనో చూచినజ్ఞాపక ముండి యోచించుచుంటిని.

చంద్రిశ—శూరసింహా! మమ్ముల నీ వింకను గుర్తించలేదా?

శూర—అయ్యా! మీరెవరో నేనింతవరకును గుర్తింపలేదు. దయ చేసి మీనామంబుల నాకెఱింగించిన బాగుగా నుండును.

చంద్రిశ—(పురంజయునిఁజూపి) ఇతఁడు బుద్ధిమంతుని కుమారుఁడగు పురంజయుఁడు.

శూర — ఆహా! ఏమేమీ! ఇతండు బుద్ధిమంతునికుమారుఁడగు పురంజయుఁడా? ఎంతచిత్రము! (పురంజయుఁ గౌఁగిలించుకొని) నాయనా! నేనును, నీతండ్రియగు బుద్ధిమంతుఁడును బాల్యస్నేహితులముసుమీ! నిన్ను చిన్ననాటను జూచితిఁగావున బాగుగా గుర్తిడలేదు. (చంద్రశర్మను జూపుచు) తండ్రీ! పురంజయా! ఈబ్రాహ్మణకుమారుఁ డెవ్వరు?

పురం — అయ్యా! ఇతఁడు రాజపురోహితుఁడగు సుదేవుని కుమారుఁడగు చంద్రశర్మ.

శూర — ఆహా! ఏమేమీ! ఇతఁడు చంద్రశర్మయా? (చంద్రశర్మనుజూచి) విప్రోత్తమా! నిన్ను నేనెంతమాత్రమును గుర్తించకపోయితిగదా! అయ్యా! మీరలిద్దరు పావనులగు మన సుశీలాసుదర్శనుల నెందైనఁ గాంచితిరా?

పురం — అయ్యా! పావనియగు సుశీలాదేవియు, తనప్రియసఖియగు కాశీపురరాజపుత్రి చంద్రకళతో సుదర్శనుఁడును, నిచ్చటికి కొంతదూరముననున్న యోగానందాశ్రమమున సురక్షితముగానున్నవారు.

శూర — ఆహా! నే డెంతటిసుదినము! నాహృదయం బానందాంబుధిఁ దేలియాడుచున్నయదిగదా! (పురంజయుఁజూచి) పురంజయా! నా నోములు ఫలించినవి. మన సుదర్శనునికొరకై నేను చారుల నంపి యెందునుగానక నిరాశుఁడనైపోయితిని.

చంద్రశ — శూరసింహా! సురేంద్రుఁడు తనరాజ్యముఁ దీసికొనుటకై నిన్ను సహాయపడుమని మమ్ముల నీయొద్దకుఁ బంపెను.

శూర — చంద్రశర్మా! నే నీదుష్టుఁడగు సురేంద్రుని రాజ్యపరిచ్యుతుగావించి సుదర్శనునికే యిప్పింపవలయునని యే చూచితినిగాని వీరిజాడ నాకు దొరకనందున చింతాకులమానసుండనై యూరకుంటిని సుమీ! ఇంతమాత్రమునకై నన్ను సహాయ

ము వేడవలయునా? నా ప్రాణములైనను ధారవోసి యీ రాజ్యంబు నాతనిస్వాధీనంబు గావించనుంటిని. ఇందు కేంత మాత్రమును మీరు సందేహ మొందకుడు.

చంద్రిక—ఇంక మాకు సెలవొసంగుడు. మే మీవార్త సుదర్శనుని కెరింగించి యాతని సంతసింపఁజేసి యుద్ధసన్నద్ధునిఁ గావించెదము.

శూర—ఇందుకై నా ప్రాణంబులనైనను ధారవోయుటకు బూను కొంటిని.

చంద్రిక—దైవము నీకు సహాయపడుగాక!

(చంద్రికర్మ, పురంజయులు నిష్క్రమింతురు.)

శూర—నామనం బిప్పుడు కుదుటఁబడ్డది. ఇంక నాదుష్టుఁడగు సురేంద్రునిఁ బారదోలిన ప్రజలు తప్పక సుఖంతురు.

(నిష్క్రమించును.)

చతుర్థరంగము - అయోధ్యాపురసమీపమున నొక శిబిరము.

(ప్రవేశము-శిబిరమునుండి సుశీల, సుదర్శన, చంద్రికళ, కమలయు)

సుశీ—(చేయెత్తి చూపుచు) కుమారా! సుదర్శనా! అటు చూడుము.

చ॥ లలితమనోవిలాసమయి ♦ లచ్చికితోడయి రామణీయమై
విలసితరూపరాశియయి ♦ వేడ్కలనొప్పెడి వింతస్వర్గమై
వెలసెడి దీయయోధ్యపురి ♦ వేవిధులం దగ నొప్పుచుండె గా
యిలపయి పుణ్యభూమియిదె ♦ యింపుగఁజూడుమి పుత్రరత్నమా!

సుద—ఆహా! దానవభీముఁడగు రాముఁ డుదయించిన పురం బియ్యది యేనా?

గీ॥ ఏను జన్మంబునొందిన ♦ యీపురంబు
నెన్నినాళ్ళకుఁ జూడగ ♦ నిటులనబ్బె

కన్నులకుఁ గఱ్వతీరెను ♦ గాంచగాను
నాదుహృదయం బదెంతో యా ♦ నందమందె॥

ఆహా! ఏమి దీనియందము!

ఉ॥ అంబరచుంబితంబులయి ♦ యందము గుల్కెడునట్టి భవ్యసౌ
ధంబులతోడ దంబుగని ♦ తద్దయు నంమనమొప్పుచుండు ఆ
ఖంభర వేణులెంతయును ♦ భాసురమానముతో జలింపగా
నింబగు నిప్పురంబునకు ♦ నెందును సాటియొసంగ దారయన్॥

ఆహా! ఇప్పటికి నాహృదయంబు పావనంబయ్యె. నేను ధన్యుఁడనైతిని. (చంద్రికళనుజూచి) ప్రాణేశ్వరీ! చంద్రికళా! ఇప్పురంబు జూచితివా? ఇయ్యదియే మదీయజన్మస్థానంబగు నయోధ్యాపురంబు.

చంద్రి— నాథా! ఆనందదాయకంబగు నిప్పురవరంబుసౌందర్యము గాంచిన నామది నెంతయు నానందం బుదయించినది. (ఎదుట జూచి) అరుగో! ఇటకెవరో వచ్చుచున్నవారు.

(ప్రవేశము - కొందరు పౌరులు)

పౌరు—

మత్త॥ ఎంతకూరుడో యెంతకూరుడో ♦ యేమనందుము బాబురో
పంతమొప్పగ మమ్ము నెంతయుఁ ♦ బాధచేసెను బాబురో
సుంతయైనను మమ్ము ప్రేమగ ♦ జూడలేదుగ బాబురో
చింతమాయెడఁ గూంతయైనను ♦ జేరనివ్వడు బాబురో॥

మొద— అయ్యో! దేవుడా! మాకొంప మునిగినదిరా బాబూ!

రెండ— మేమంతా తిండికిఁ జస్తున్నాఁరా దేవుడా!

మూడ— మాకెక్కడి యము డిటువంటిరాజు దొరకేడా తండ్రీ!

మొద— అన్నలారా! మీరింకూర్కె చింతిస్తే లాభంలేదు. సుదర్శన మూ— జొచ్చాడట. వారిదగ్గరకెత్తే మనయాపద నివారిస్తాడు.

రెండ—(సుశీల మొదలగువారిఁజూపి) అదిగో, అక్కడవారో యున్నారు.
మొద—మన సుశీలమ్మగార్లాగే యున్నారు.
రెండ—ఔనౌను. నాకల్లే తోస్తున్నాది.
మొద—అదిగో! ఇంకో కపక్కనున్నాడే అతనే సుదర్శనమహారాజుగారు.
రెండ—ఔనౌను. నాకల్లే కన్పడుచున్నారు.
మొద—అయిన మనముపోయి మొఱబెట్టుకుందాము రండు. (అందరు సుశీలా సుదర్శనుల చెంతకేగి) దండాలు, దండాలు మహాప్రభూ!
సుశీ—(ఆదరించి) అన్నలారా! మీకుగల్గిన బాధయేమో తెలుపుడు.
మొద—అమ్మా! మీసవతితనయుఁడగు సురేంద్రుఁడు మమ్ముల బెట్టిన బాధ లింతింతయనరాదు. వినుఁడు.

సీ॥ పన్ను లెంతయు వేసి ♦ పాపపుఁద్రోవల
మాదుధనంబుల ♦ మంటగలిపె

సుద—ఆహా! ఎంతదుర్మార్గుఁ డెంతదుర్మార్గుఁడు!
సుశీ—ఆహా! ఎంతఘోర మెంతఘోరము!

మొద॥ చక్కగానున్న మా ♦ జవరాండ్రనెంతయు
బలవంతముగ పాడు ♦ పఱచినాఁడు

సుశీ—హరిహరీ! (చెవులు మూసికొనును)

మొద॥ ధనదునినైనను ♦ దండించి క్రూరుఁడై
కట్టగుడ్డలనీక ♦ కాల్చినాఁడు

సుశీ—కటకటా!
సుద—కట్టా! ఎంతటిదుష్టుఁడోగదా!

మొద॥ కూటికై మాడుచు ♦ గుర్రుమ్రరుచుండగ
మమ్ముఁజంపగ సేన ♦ గ్రమ్మినాఁడు

సుశీ—ఛీ! ఛీ! ఎంతటి కృపాహీనుఁడు!

సుద—ఔరా! సురేంద్రా! నీ వింతటిద్రోహివా?

మొద—గీ॥ పెట్టరానట్టి కష్టముల్ ♦ పెట్టుచుండె
నడువరానట్టి దుష్టతఁ ♦ నడచుచుండె
మాదుగతి నిట్టులను జేసి ♦ మాడ్చుచుండె
నేమనందువు మేమింక ♦ నిజముగాను.

సుశీ—ఆహా! ఎంతఘోర మెంతఘోరము! (సుదర్శనుజూచి) కుమారా! వింటివిగదా! ఇంతటి దుర్మార్గుని మనమెందైనఁ గాంచితిమా?

సుద—తల్లీ! ఈ సురేంద్రుఁ డింతటి దుర్మార్గుఁడని నేనెప్పుడును దలపెట్టలేదుసుమా!— ఔరా! వీడెంతటి దుర్మదాంధుఁడై చెలగుచుండె! (పౌరులఁజూచి) అన్నలారా! మీరలెంతమాత్రమును జింతింపకుఁడు. దుష్టశిక్షణ శిష్టరక్షణాదక్షుండగు నీ సుదర్శనుడుండ మీకెంతమాత్రమును భయంబులేదు. నేను నాప్రాణముల నర్పించియైనను దుష్టుఁడగు నాసురేంద్రుని రాజ్యపరిచ్యుతుఁగావించి మీకష్టంబులఁ దీర్చెదను. మీరింక బొండు.

సుశీ—అన్నలారా! మా సుదర్శనుఁడు మీయాపదఁ దప్పక నివారించును. మీ రింకెంతమాత్రమును భయపడకుఁడు.

అంద—అమ్మా! పుణ్యాత్ములగు మీరుండ మాకికేమిభయము? మే మింకఁ బోయి వచ్చెదము.

(నిష్క్రమింతురు.)

సుశీ—కుమారా! పాపము! వీరెంత దీనాననులై మన చెంతకు వచ్చిరి!

సుద—కటకటా! వీరిదీనత్వముఁ గాంచిన నాహృదయం బిప్పటికిని ఖేదమొందుచున్నయదిగదా—అదుగో పురంజయుఁ డిటకే వచ్చుచున్నవాఁడు.

(ప్రవేశము - పురంజయుఁడు.)

పురం—అమగో! పావనియగు సుశీలాదేవియు, మిత్రుఁడగు సుదర్శనుఁడును, మన్మనోహారియగు కమలయు నాకొరకై నిరీక్షించుచున్నట్టు కన్పడుచున్నవారు. (చెంతకేగి) తల్లీ! నీదాసుఁ డిదె నమస్కరించుచున్నవాఁడు. (సుశీలకు మ్రొక్కును.)

సుశీ—తండ్రీ! పురంజయా! విశేషములేమి?

పురం—అమ్మా! దండనాయకుఁడగు శూరసింహుఁడు మనకై తన ప్రాణముల నిచ్చుటకైనను సంసిద్ధుఁడై యున్నవాఁడు. నేను మీరు చెప్పినప్రకార మంతటను మనభటుల గుప్తముగా నుంచితిని.

చంద్రి—(కమలను చెంతకుఁబిలిచి మెల్లగా) కమలా! ఇప్పటివరకును, 'నామనోహారుఁడు నామనోహారుఁ'డని కలువరించితివి. ఇంకేమి నీమనోహారుండు వచ్చెఁగదా!

కమ—ఓహో! నీకెప్పుడును పరిహాసములేనా?

సుశీ—మీరిక భుజియింప రండు.

(అందరు నిష్క్రమింతురు.)

---

పంచమరంగము - అయోధ్యాపుర రాజభవనము.

(మోహినీ సురేంద్రులొక సోఫాపై విచారముచే నుందురు.)

మోహి—హా! కుమారా! నే నీరోజున నెంతటి ఘోరవార్తను వింటిని. అయ్యో! నామనంబంతయు దుఃఖాకులంబై పోయినది. ఆహా! సుదర్శనుఁ డెంత దుష్టుఁడు! నాతండ్రినే చంపినాడుగదా?

సురేం—తల్లీ! పూజ్యుఁడగు మాపితామహునిఁ జంపినందుకై వీనిని దప్పక పరిమార్చెదను. నీ వింక నూరడిల్లుము.

మోహి—హా! పితా! నయనపాలమహారాజా! నీసుకుమార శరీరంబు దుష్టసుదర్శనాయుధంబుచే హతమయ్యెను గదా! నాయనా! తిరిగి నీముఖమునైనను జూచుభాగ్యము లభింపలేదుగదా! ఓరా! సుదర్శనా! నీవెంతటి దుర్మార్గుఁడవు. నా ప్రియపితామహునిఁ జంపిన నీకేమివచ్చె? నిన్ను, మాతల్లియగు సుశీలను పాపమని చంపక విడచిపెట్టినందుకా, నేఁడు నాతండ్రిఁ జంపి ద్రోహులైతిరి?

సురేం—తల్లీ! నీ వెంతమాత్రమును జింతిల్లకుము.

గీ॥ గట్టిగా వాని మూర్ఖుని ♦ గసిమసంగి
కండకండలుగాఁగోసి ♦ కాకులకును
వేసి భుజియింపఁ జేతును ♦ వేడ్కతోడ
తగదు నీవిట్లు దుఃఖింప ♦ తగదు తల్లి!

మోహి—నాయనా! సురేంద్రా! నీవంటి పుత్రుఁడు నాకుఁ బుట్టుటకు పూర్వజన్మంబున నే నెన్నినోములను నోచితినోగదా!

గీ॥ సంతసించితినయ్య నీ ♦ చక్కనైన
గుణములఁ గని నేనెంతో ♦ గుణవరేణ్య
నాకు నీవంటి పుత్రుఁడు ♦ నలువమీఱ
నుండ నింకేమికొదువయా ♦ నో కుమార!

సురేం—అమ్మా! నేను వరించినట్టి కాశీరాజపుత్రిని, నీదుర్మార్గుఁడను సుదర్శనుండు వివాహంబాడెను.

మోహి—నాతల్లీ! నీ వెంతమాత్రమును చింతిల్లకుము. ఆకురూపివనిత మనకెందుకు? నీసుజనత్వంబును, నీసుందరాకారంబును నీక్షించిన, చక్రవర్తిబిడ్డయైనను నీకాళ్లపైఁబడి మోహించును. నీకు దానిని నెత్తినఁదన్నుదానిని వివాహంబు గావింతునులే!

సురేం—నాకు నాపితామహుఁడు చచ్చిన దంత చింతఁ గలిగించక పోయినను, ఆకాంత సుదర్శనుని వివాహమాడినదని వినిన నాకెంతయుఁ జింత గలిగెను.

మోహి—(నవ్వుచు) అయ్యో! నాపిచ్చితండ్రీ! నీ వింతమాత్రమునకే చింతిల్లవలయునా? మునివేషధారియై వనములనుండువానికే యొక కురూపివనిత లభించిన, నీకెంతమంది సుందరస్త్రీలు లభించరు? ఇంకనైనను చింత మానుము.

(ప్రవేశము - ఒక భటుఁడు.)

భటు—మహాప్రభూ! శత్రుసైన్యంబంతయును మన కోటలోఁబడి యెదురఁబడి యుద్ధమునర్చువారిని హతము గావించుచున్నది.

మోహి—ఏమీ! యీఘోరవార్త! మన సైనికులంత యప్రయత్నులై యుండుటకుఁ గారణం బేమి?

భటు—మన సైనికులంతయు వారితో గలిసిపోయినట్టు దోచుచున్నయది.

సురేం—(తనలో) అయ్యయ్యో! నాపాదములు గడగడ వణకుచున్నయవి. యుద్ధమనిన నాకిసలేభయమనిన నీయుద్ధ మొకటి నాకుఁ దాపురమైనది దైవమా! (ప్రకాశముగా) ఇది యంతయు నేమియో యయోమయముగా నున్నయది. నాకేమియుఁ దోచుటలేదు.

( తెరలో భేరీనాదము )

మోహి—అబ్బబ్బా! ఏ మీనాదము! భేరీనాదము గావలయును.

సురేం—అబ్బా! నాహృదయంబంతయు ఝల్లుమనుచున్నయది. (భటునిఁజూచి) ఓరీ! మన మంత్రిశేఖరుఁడగు దుష్టసేనుని కీవార్తఁ దెలిపి తోడ్కొనిరమ్ము.

భటు—చిత్తము. (ఈవలకు వచ్చి) తాగుబోతుమంత్రి మాకీయం

తెరిక్కడ దాపురమైనాఁడోగదా!

(నిష్క్రమించును.)

మోహి—ఔరా! ఏ మీావింత! ఇప్పు డిప్పుడే శత్రువులు మన కోటలో దూరిపోయిరా?

సురేం—తల్లీ! నాకిదే చిత్రముగా తోచుచున్నయది. (ఎదుటజూచి) అదిగో! మన యమాత్యపుంగవుండగు దుష్టసేనుఁ డిటకే వచ్చుచున్నవాఁడు.

(ప్రవేశము - దుష్టసేనుఁడు.)

దుష్ట—(మోహినీసురేంద్రులఁ జూచి) మహాప్రభూ! ఇప్పుడు మన పురంబునఁ బ్రవేశించినశత్రుఁడు సుదర్శనుఁడుసుమీా!

సురేం—ఏమేమీా! సుదర్శనుండా? వాఁ డేవిధంబున మనకోటఁ బ్రవేశించెనో?

మోహి—ఆహా! సుదర్శనుండేనా?

దుష్ట—సుదర్శనుఁడొక్కఁడే కాదు. అందు రాజద్రోహియగు మన శూరసింహుఁడుగూడ నున్నవాఁడు.

సురేం—కటకటా! సైన్యాధిపతియగు శూరసింహుఁడుగూడ శత్రుపక్షమయ్యెనా?

మోహి—కట్టా! ఈ శూరసింహుఁ డెంతద్రోహి!

(భటుఁడొకఁడు ప్రవేశించి)

భటు—మహాప్రభూ! శత్రువులు రాజభవనమునందు ప్రవేశించినారు.

సురేం—(మోహినిఁ జూచి) తల్లీ! నీవిఁక లోపలికేగుము. మాప్రయత్నము మేము కావించుకొందుము.

మోహి—అయ్యో! దైవమా! ఎట్టి యిక్కట్ల పాల్జేసితివి!

(నిష్క్రమించును.)

(ప్రవేశము—సుదర్శన, పురంజయ, శూరసింహ, చంద్రశర్మలు ఖడ్గపాణులై భటవర్గముతో)

సుద—పురంజయా! చూచెదవేమి? వారి నింక బంధింపుము.

పురం—చిత్తము. (భటుల కాజ్ఞాపించును.)

సుద—(భటులచే బంధింపఁబడుచున్న సురేంద్రదుష్టసేనులఁ జూచి తలయూచుచు) మీ గర్వంబు లింకను నణఁగలేదు. (పురంజయుఁ జూచి) పురంజయా! వీరిఁ దీసికొనిపోయి, మన కారాగారాధ్యక్షుని యాధీనంబు గావించి జాగ్రత్తయని నుడువుము. రేపటిసభలో వీరివిషయమై విచారింతము.

పురం—చిత్తము. (బంధితులైన సురేంద్రదుష్టసేనులఁ దీసికొని నిష్క్రమించును.)

సుద—శూరసింహా! మన మింక తక్కినపనులవిషయమై పోవుదము రమ్ము.

శూర—చిత్తము.

(అందరు నిష్క్రమింతురు)

---

షష్ఠరంగము - అయోధ్యాపుర సభాభవనము.

(సింహాసనముపై చంద్రికాసుదర్శనులును, వెనుక కమలయును యిరుప్రక్కల శూరసింహపురంజయచంద్రశర్మలు మొదలగువార లుందురు. కొందరు గాయకస్త్రీలు నాట్యమాడి వెడలిపోవుదురు.)

సుద—పురంజయా! నిన్నటిరోజున బట్టుకొనిన యపరాధు నిచ్చటికి రప్పింపుము.

పురం—చిత్తము. (నిలువఁబడి భటుల కాజ్ఞాపించును.)

(ప్రవేశము - బంధితుఁడగు సురేంద్రుఁడు.)

సుద—(సురేంద్రుఁ జూచి) సోదరా! సురేంద్రా! నీవిప్పుడు ప్రజా